# నవకథామంజరి

50 మంది ఆధునిక తెలుగు కథకుల 150 రచనల్లో ఎన్నికగన్న
10 ఉత్తమ కథలు

సంకలనం - ఎన్నిక
దక్షిణ భాషా పుస్తక సంస్థ

ప్రచురణ కర్తలు
విశ్వవాణి పబ్లిషర్స్, విజయవాడ.

# NAVA KATHA MANJARI

ANTHOLOGY OF RECENT SHORT STORIES IN TELUGU.

*Selected By*

SOUTHERN LANGUAGES BOOK TRUST,
With the kind permission of the copy-right holders.

First Edition: 5,000 Copies
APRIL 1961

**PRICE: Rs. 1-25**

---

*Published under the auspices of*
The Southern Languages Book Trust, Madras-31
Second Series-Telugu: 5

---

*Published by:*
Viswavani Publishers, Vijayawada.

*Printed at:*
Raja Press, Vijayawada-1

# తొలిపలుకు

ప్రాంతీయ భాషలన్నిటిలోనూ ఒక భాషలోని ఉత్తమ రచనలను ఇతరభాషలలోనికి తర్జుమా చేయించుటకూ, దక్షిణ భాషలునాల్గింటిలోనూ మంచి పుస్తకములను చౌకగా ప్రచురించుటకూ సంకల్పించి, దక్షిణ భాషాపుస్తక సంస్థ కావించుచున్న ప్రశంసనీయమైన కృషికి నే నా సంస్థను అభినందించుచున్నాను. మన భాషలలో చౌకధరలకు దొరకు మంచి పుస్తకములకు ఎంతేని అవసరమున్నది. ఈ అవసరమును ఈ పుస్తక సంస్థ తీర్పగలదని నా నమ్మకము. ఈసంస్థ తలపెట్టిన కార్యకలాపము ఫలప్రదముగా కొనసాగవలెనని నేను ఆశించుచున్నాను.

ముఖ్యమంత్రి,
ఆంధ్రప్రదేశ ప్రభుత్వము.

హైదరాబాదు,
26-9-1960.

# కథాక్రమం

# వానలో తడుస్తున్న మనిషి

"మంజుశ్రీ"

దురాశల ఆవలి తీరాలు చేరుకున్న తర్వాత మనిషి; చిన్నతనం లోనే జీవితంలో పురస్కారాలు పొదుల్చుకున్నవాడు; అమ్మ గుర్తు వస్తే తప్ప యెప్పుడూ కన్నీళ్ళు రానివాడు; ఎఱుపురంగు పూసుకున్న పోస్టు డబ్బాలు కనపడితే భయపడేవాడు; వీథివెంట నడుస్తున్నాడు. తుడిచి పెట్టిన అద్దంలాపున్న సూర్యుడు కనపడటంలేదు. వాన వచ్చేలావుంది. వానంటే భయం అతడికి. వానలో తిరగకూడదని, అనగా తడవకూడదని ప్రతిసారీ జబ్బుపడ్డప్పుడు చెప్పేవాళ్ళు, మందులిచ్చేవాళ్ళు.

చిన్నప్పుడెప్పుడో కుక్క కరచిం దతణ్ణి. అది పిచ్చికుక్క అన్నా రెవ్వరో, అమ్మ కావిలించుకుని యేడ్చింది.

వానవచ్చే సూచనలు కనపడితే తాడుపెట్టి కట్టేసేది చిన్న తనంలో. సెనగలు తిననిచ్చేదికాదు, కుక్క కరచినవాళ్ళు వానలో తడవకూడదట, సెనగలు తినకూడదట.

పెద్దవా డవుతున్నకొద్దీ చాలమంది కరిచా రతణ్ణి,

పరీక్షలు తప్పాడు. అందుకు యెప్పుడూ ఏడవలేదు!

అమ్మ యేడ్చింది. నానా అడ్డమైనవాళ్ళదగ్గరనుంచీ చాలా చాలా గొప్పవాళ్ళ వరకూ వట్టి అప్రయోజక శిఖామణివి – అన్నారు.

ఎవరిముందూ కాదనలేదు. కొందరిముందు అవునన్నాడు.

చిన్నప్పు డెప్పుడేనా క్లాసులో కూచుని పాఠాలుచెబుతున్న మాస్టర్ల హావభావ విలాసాలను బొమ్మలు గీసేవాడు.

దెబ్బలు తిన్నాడు.

కాలేజీకి వచ్చినతర్వాత, పాఠాలు చెపుతుంటే వాళ్ళో పెట్టుకుని తలవంచుకుని, నవలలు చదివేవాడు.

ఆ తరువాత కథలు వ్రాశాడు. అమ్మనిగురించికూడా వ్రాశాడు. అమ్మ అన్నది "ఓసారి–మామయ్యగారింటికి వెళ్లు. శకుంతల నిన్ను

చూడాలనుకుంటోందట" నిజమే ననుకొన్నాడు. మామయ్యగారింటికి వెళ్ళాడు. శకుంతల పరీక్షలు ప్యాసైంది. చాలా అందంగా ఉంది.

వారంరోజు లున్నతరువాత రేపు తిరిగి వద్దామనుకొంటుండగా రాత్రి వెన్నెల వచ్చింది. వెన్నెట్లో చెట్లు. వెన్నెల బావుంది.

చంద్రకాంతపు మొక్క లున్నాయి. గోడవారగా ఐదో ఆరో. అన్ని మొక్కలకీ ఒక్క పువ్వే వుంది.

"అవి కోయలేదేం"- అని అడిగాడు శకుంతలని.

"తల్లిచెట్టుకి వొక్కొక్క పువ్వైనా వుంచాలి," అని చెప్పింది శకుంతల.

గదిలో కూచున్నారు. కిటికీలోంచి రోడ్డు దూరంగా కనిపిస్తున్నది. దూరంగా రోడ్డుమీద కంకర కొడుతున్న కూలివాళ్లు పాటలు పాడుకుంటున్నారు.

"రేపు వెళ్ళిపోతున్నాను," అని చెప్పాడు.

చాలాసేపు మాటాడకుండా వుండి, చివర కిలా అన్నది శకుంతల, "వాళ్ళు నయం బావా నీకంటే, చాలానయం,"

"ఎవరు వాళ్ళు?"

"అదే దూరంగా రోడ్డుమీద కంకర కొట్టుకుంటున్నారే, వాళ్ళు. దేశానికూడా నీలా విషాద ప్రేమ కథలూ, నగ్నచిత్రాలూ రచించే వాళ్ళకంటే వాళ్ళే ఉపయోగం".

తెల్లవారిన తరువాత ఊరెళ్ళిపోయాడు. మళ్ళీ మామయ్యగారింటికి పోలేదు.

తరువాత యెప్పుడో శకుంతలకి పెళ్ళయింది.

చాలానాళ్ళ తరువాత స్టేషన్లో కనపడింది. ఇద్దరు పిల్లలూ, తానూ. దిగులుగా నవ్వుతూ "పెండ్లి చేసుకోవద్దు బావా, అదృష్టవంతుడివి కావాలంటే" అని చెప్పింది.

త్వరత్వరగా వెళ్ళిపోయాడు. ఇంటికి పోయిన తర్వాత "ఇద్దరు పిల్లల తల్లి"—అని బొమ్మగీశాడు. అసహ్యంగా లావయి, చెక్కిళ్ళు గుంటలుపడి, ముఖం ముడతలుపడి దిగులుగా నవ్వుతూ.

తరువాత యెన్నో వానలు కురిశాయి.

కిటికీతలుపులు కూడా మూసుకుని భద్రంగా గదిలో కూచున్నాడు. నాన్నకు విసుగ్గావుంది. అమ్మకు దుఃఖంగావుంది. పరీక్షలకీ చదవటం లేదు.

ఇంట్లో వుండలేక "ఉద్యోగం చేస్తా"నన్నాడు.

"ఎవరిస్తా"రన్నాడు నాన్న వెటకారంగా.

అమ్మపాదాలు కళ్ళకద్దుకుని మహానగరం వచ్చాడు కుర్రవాడు. పత్రికలలో కథలు పడుతున్నాయి.

బొమ్మలు గీస్తున్నాడు.

ఎక్కడో పాడుపడ్డ కొంపలో బాగున్న గదిలో రాత్రిళ్ళు పడుకుంటాడు. వీధిపేరు అతడికి తెలీదు. వీధిపేరు తెలుసుకుంటే, ఇంటి నెంబరు గుర్తుంటే అమ్మదగ్గరనుంచి ఉత్తరం వస్తుంది. అందుకే వీధి పేరు తెలుసుకోలేదు. ఇంటికి ఉత్తరం వ్రాయలేదు. పోష్టుడబ్బాలు చూస్తే అందుకే భయం. ఉత్తరాలు గుర్తువస్తాయి. అమ్మ గుర్తొస్తుంది. ఎన్నో గుర్తొస్తాయి. బ్రతుకుతున్నానన్న విషయం గుర్తొస్తుంది. వాన చినుకులు గుర్తువస్తాయి.

ఎప్పుడేనా గోవిందు వెతుక్కుంటూ వచ్చి కథ పడ్డ పత్రిక యిస్తాడు. పది రూపాయ లిస్తాడు. ఎప్పుడేనా, ఇంకో పది కావాలన్నా యిస్తాడు.

క్రిందటిసారి వానలో తడిసి మూడు నెలలు కాలేదు. ఆస్పత్రినుంచి వచ్చి రెండు నెలలు కాలేదు.

మళ్ళీ వాన వచ్చేలావుంది. అందుకే కుర్రవాడు గబగబా నడుస్తున్నాడు అది బజారువీధి కాదు. పళ్ళ దుకాణాలుకూడా లేవు. కిల్లీషాపులు కూడా లేవు. అందుకే కుర్రవాడు గబగబా నడుస్తున్నాడు. అతడి పేరు ముకుందరావు. మహానగరంలో వున్నాడు. ప్రస్తుతం వీధివెంట నడుస్తున్నాడు. ప్రస్తుతం ముకుందరావు వానలో తడిసేలోపున, క్రిందటిసారి వానలో తడిసిన విషయం – ఇది కథ.

రోడ్డుమీద పరిగెత్తినా ముద్దముద్దగా తడిసిన ముకుందరావు పాడు పడ్డ ఇంటిలోని బాగున్న గదిలో ఆ రాత్రి పడుకుంటే పొద్దునకల్లా వొళ్ళు నొప్పులు పుట్టి జ్వరంవచ్చింది.

ముకుందరావు, గోవిందరావు ఇంటికి వెళ్ళాడు. నడిచే వెళ్ళాడు జేబులో చిల్లరడబ్బులు లేక. గోవిందరావు, భార్య బయటజేరితే వచ్చి నట్టు కంపటి రాజేసుకుంటున్నాడు.

ముకుందరావు వెళ్ళి జ్వరంవచ్చిందిరా గోవిందూ - అని చెప్పాడు. గోవిందరావుకి కళ్ళ నీళ్ళు వచ్చినయ్, కుంపటి రాజుకోక! భార్యని తిట్టుకుని, తనని తాను తిట్టుకుని, ముకుందరావుని తిట్టి, ఆఫీసుని తిట్టి, రిజా మాట్లాడి పక్కనే కూచోబెట్టుకుని, ఆస్పత్రికి చేర్చి, "వీడు చస్తే నాకు కబురుచేయండని" డాక్టరుగారికి చెప్పి వెళ్ళిపోయాడు. ముకుందరావుకి యీసారి ఆస్పత్రి బావుంది. ఈ రోగం పెద్దదయితే, తగ్గిపోయిందాకా హాయిగా ఇక్కడే వుండునుకదా - అనుకున్నాడు.

రెండురోజులు పోయింతర్వాత గోవిందరావు వచ్చాడు.

ఇంటికి ఉత్తరం వ్రాశాడట. అమ్మ ఉత్తరం వ్రాసింది. తెచ్చి యిచ్చాడు. ముకుందరావు చదవలేదు - ఆ ఉత్తరంలో యేముంటుందో అతడికి తెలుసు.

మళ్ళీ రెండురోజులు పోయినతర్వాత గోవిందరావు వచ్చాడు. నాన్న డబ్బు పంపించాడట. ఇచ్చిపోయాడు.

ఆ సాయంకాలం నర్సువచ్చి, "నెలరోజులదాకా ఇక్కడే వుండాలి మీరు," అని చెప్పింది.

"న్యుమోనియాలోకి దించుతుందేమోనని భయంగా వుంది," అని చెప్పింది.

"భయమెందుకు?" అన్నాడు ముకుందరావు.

నర్సు తెల్లబోయింది. కళ్ళు విప్పార్చుకుని విచిత్రంగా చూసింది. అలా చూడటం ముకుందరావుకి బాగుంది. చిన్నప్పుడు శకుంతల అలానే చూసేది. ఆస్పత్రివిషయాలు యెన్నో తెలుసు నతడికి.

పేరేమిటని అడిగాడు నర్సుని. ఎందుకు? అన్నది. చెప్పనవసరం లేదులే - అన్నాడు.

'అయితే చెపుతున్నాను. సరోజిని....'

"ఈ ఉద్యోగంఎందుకుచేస్తున్నావు?"చాలారోజులతర్వాతఆమె ఈ ఉద్యోగంచెయ్యటం ఇష్టంలేనివాడులా అడిగాడు. ఆమె దిగులుగా చూసి వెళ్ళిపోయింది. నాలుగు రోజులు ఆ ప్రశ్నని మరచిపోయాడు. ఐదో రోజున అడిగాడు. "ఈ ఉద్యోగం ఎందుకు చేస్తున్నావు?" ఆమె దిగులుగా వెళ్ళిపోయింది. తరువాత ప్రతిరోజూ అడిగాడు. ఆమె చెప్పలేదు. అడిగేవాడు. ఆమెకు కోపం వచ్చింది. "ఇలా అడిగితే ఈ వార్డునుంచి డ్యూటీ మార్పించుకుంటాను."

"ఉద్యోగమే మానేయరాదూ?"

ఆమె మౌనంగా వెళ్ళిపోయింది. మర్రోజు రాలేదు ఆమె. ఆ మరు రోజు రాలేదు. మూడోరోజూ రాలేదు. ముకుందరావు సంతోషించాడు. నిజంగా ఆమె ఉద్యోగంమానేసిందని.

ఆమెబావుంది. ఆమె చాలామంచిది. ఎందుకో ఆమె యీ ఉద్యోగం చెయ్యటం, అతడికి ఇష్టంలేదు. వారంరోజులు తర్వాత, ఓరోజు సాయంకాలం దీపాలు వెలిగిన తర్వాత, ఆరుగంటల తర్వాత——

రోగులను చూడటానికి వచ్చిన వాళ్ళ వాళ్ళ బంధువులంతా దిగులైన ముఖాలతో వార్డులోంచి వెళ్ళిపోయినతరువాత ఆమె వచ్చింది.

గోవిందరావు వెళ్ళిపోయాడు. అమ్మ వ్రాసిన ఉత్తరం చదువుకుంటున్నాడతడు. ఆమె వచ్చింది.

ఉత్తరం దిండుకింద దాచి ఆమెకేసి చూశాడు.

కళ్ళుతుడుచుకుని చూసిన తర్వాత ఆమె ఆమెగా కన్పించిందతడికి. మళ్ళీ వచ్చింది. నిమిషం సేపు తలవంచుకుని చిరునవ్వు తెచ్చిపెట్టుకుని "తప్పకుండా తగ్గిపోతుందిలెండి. భయపడకండి"అని చెప్పింది ఆమె.

"భయమెందుకు?" అన్నాడతడు.

ఆమెకు దిగులైంది. వెళ్ళిపోయింది.

ఆమె యేదో అడగాలని వచ్చింది. 'ఎక్కడనుంచి ఆ ఉత్తరం?'అని.

"ఉద్యోగం మానెయ్యలేదూ?" అని అడిగాడతను.

ఆమె తలవంచుకుని వెళ్ళిపోయింది. అతడు కళ్ళుతుడుచు

కున్నాడు. రాత్రి నిద్రపొమ్మని చెప్పటానికి వచ్చినప్పుడు మళ్ళీ అడిగాడు, "ఉద్యోగం మానేయరాదూ?" అని. ఆమె నవ్వింది. "మానేస్తాను. పోనీ చెప్పండి, భోజనం మీరు పెడతారా?"

అతడు ఆలోచనలో పడ్డాడు.

ఆమె అతడివేపు కాసేపు వుత్సుకతతో చూసి, గుండెలవరకూ దుప్పటి లాగి వెళ్ళిపోయింది.

అతడు పిలిచాడు.

వినిపించుకోకుండా, "నిద్రపోండి. పక్కగదిలోనే ఉంటాను. అవసరమైతే పిలవండి," అని వెళ్ళిపోయింది.

ఐదు నిమిషాలు కాకముందే అతడు పిలిచాడు. ఆమె వచ్చింది. "ఉద్యోగం మానెయ్యరాదూ?"

ఆమె నవ్వింది దిగులుగా, అందంగా, ఆహ్లాదకరంగా. "మిమ్మల్ని ఇక్కడనుంచి ఇంకో ఆస్పత్రికి మార్చమని డాక్టరుగారికి చెప్పనా?"

"ఎందుకు?"

"పిచ్చాస్పత్రికి"- అతనూ నవ్వాడు. ఆమె వెళ్ళిపోయింది. నడిరాత్రివేళ అతడికి మెలకువవొచ్చింది.

ఎదురు బెడ్‌మీద చిన్నకుఱ్ఱవా డెవడో యేడుస్తున్నాడు. వాడికి పదేళ్ళుండవచ్చు. ఎవరికీ వినపడకూడదన్న వుద్దేశంతో యేడుస్తున్నాడు. కాని ఆపుకోలేకపోతున్నాడు. ఎంత ఆపుకుందామనుకున్నా వెక్కిలు ఆగటంలేదు. మధ్యమధ్య అమ్మా అమ్మా అంటున్నాడు.

ముకుందరావు ప్రయత్నించి కొద్దిగా లేచి వెన్నెముకక్రిందికి దిండ్లులాగి పడుకున్నాడు. కుఱ్ఱాడివేపు చూస్తున్నాడు. కుఱ్ఱాడు యేడుస్తున్నాడు. అమ్మా, అమ్మా అంటున్నాడు. ముకుందరావుకి కళ్ళలో నీళ్ళు తిరిగినయి. పక్కకు తిరిగి, కిటికీలోంచి రోడ్డుమీదకు చూశాడు. చుట్టూ కలయచూశాడు. కొంతమంది నిద్రపోతున్నారు. కొంతమంది మూలుగుతున్నారు. కుఱ్ఱవాడు యేడుస్తున్నాడు. కిటికీలోంచి కనిపిస్తున్న రోడ్డుమీద వెన్నెల కురుస్తున్నది. ముకుందరావు చూశాడు. అమ్మా,

అమ్మా, అంటున్నాడు కుర్రాడు. ముకుందరావుకి అమ్మ గుర్తువచ్చింది. అమ్మ యేంచేస్తుంటుంది? పక్కమీద నిద్రపట్టక కన్నీళ్లుపెట్టుకుంటుంది. దేవుడికి మొక్కుకుంటుంది.

ఆస్పత్రినుంచి వెంటనే బయటపడాలని, ఉద్యోగం దొరకాలని, పెండ్లికావాలని, కోడలు రావాలని, ఇంకా, ఇంకా,....

ముకుందరావు కళ్ళు తుడుచుకున్నాడు.

రోడ్డుమీద రిక్షాపోతోంది, గంటలు మ్రోగించుకుంటూ.

"ఇంకా నిద్రపోలేదూ?"

ముకుందరావు వెనక్కుతిరిగి చూశాడు.

"నిద్రపోండి. లేకపోతే ప్రొద్దునకల్లా టెంపరేచర్ మళ్ళ యెక్కువవుతుంది.

ముకుందరావు అడుగుదామనుకున్నాడు.

"ఈ ఉద్యోగం మానెయ్యరాదూ?" అని.

కాని ఆమె అక్కడనుంచి వెళ్ళిపోయింది ఎదురు బెడ్‌మీది కుర్రాడిదగ్గరకు. ముకుందరావు ఆమెవేపే చూస్తున్నాడు.

"ఎందుకమ్మా యేడుస్తున్నావు? నాతండ్రి కదూ, అమ్మ గుర్తు వచ్చిందా, ఇదిగో ఇటుచూడు, నేనే అమ్మననుకో, బావుందా యేం!" వాణ్ణి గుండెల కదుముకుని వోదారుస్తోంది. వాడు యేడుపుమానేశాడు.

ఎక్కువ కాంతిలేని ఆ లైట్లవెల్తురులో ముకుందరావు ఆమెవేపే చూస్తున్నాడు. ఆమె కాంతిమంతంగా కనిపిస్తోంది. అమ్మ గుర్తువచ్చింది.

వెన్నెముక నొప్పిపుడుతున్నది. పడుకోవాలి. పడుకుంటే ఆమె కనపడదు. ముకుందరావు అలానే వున్నాడు.

పది, పదిహేను నిమిషాల్లో కుర్రాడు నిద్రపోయాడు. వాణ్ణి పడుకోబెట్టి ఆమె లేచింది. ముకుందరావుదగ్గరగా వచ్చింది.

"నిద్ర రావటంలేదూ___"

.... .... .... .... .... .... ....

"నా ఉద్యోగం గురించే ఆలోచిస్తున్నారా?"

.... .... .... .... .... .... .... .... .... ....

"పోనీ మానేస్తాను. నిద్రపోతారా?"

ముకుందరావు మాట్లాడాడు, "ఒక టడుగుతాను చెబుతావా?"

"ఒకటికాదు, పది అడగండి. మీకు నిద్రైనా పడుతుందేమో."

"నీకు నిద్రరాదూ?"

"భలే ప్రశ్న!"

"నువ్వెప్పుడైనా పాపంచేశావా?" ఆమె వణికిపోయింది. ముకుందరావు చూశాడు. ఆమె కళ్లు తుడుచుకోవటంలేదు. ముకుందరావు రోడ్డుమీదికి చూశాడు. వెన్నెల మబ్బుతెరల్లోంచి పాలిపోతోంది.

"నీకు రుక్మిణీకళ్యాణంలో పద్యాలు వచ్చునా?" ఆమె నిశ్శబ్దంగా వొక్కొక్క అడుగే వేసుకుంటూ వెళ్ళిపోతోంది. దిండ్లు మెడకిందికి లాక్కుని ముకుందరావు పడుకున్నాడు. అతనికి నిద్రపట్టటంలేదు.

ఆమె వెళ్ళి గదిలో కుర్చీలో కూర్చుని కళ్లు తుడుచుకుంది. ఆమె ఆలోచిస్తున్నది.

"ఏమి టీ వింతమనిషి! పిచ్చివాడా? అన్నీ వివరాలు తెలిసి కోవాలె, ఇతడిగురించి." ఆమెకు ఇంతలోనే అసూయకలిగింది. తన కెందుకు? తెలిసికొని తా నేం చేస్తుంది? ఇంకో పదిరోజుల్లో యెలాగూ వెళ్ళిపోతాడు. ఇల్లు, సంసారం, భార్యను చూస్తాడు. ఆమె అతణ్ణి చూచి ఘొరుమంటుంది. 'ఎలా అయిపోయారు?' అంటుంది. తరువాత అతడు తనని మరచిపోతాడు. ఆమె అలానే ఆలోచిస్తున్నది. తమ్ముడు గుర్తువచ్చాడు. తమ్ముడి కీ ఊరు ట్రాన్స్ఫర్ కావటం నయమే. తాను ఉద్యోగం మానేస్తుంది. తమ్ముడూ-మరదలూ వాళ్ళమధ్య ఒంటరిగా తా నెలా బ్రతుకుతుంది! తమ్ముడికి చదువు చెప్పించింది. లేకపోతే యీ ఉద్యోగం తన కెందుకు? వాడు ఉద్యోగంలో చేరాడు. తనని ఉద్యోగం మానేయమనడేం? పెళ్ళిచేసుకున్నాడు. తనని పెళ్ళిచేసుకో మనడేం? ఎప్పుడేనా పాపం....ఏమో తనకు తెలీదు. ఆమె టేబిల్ మీద తల ఆన్చి ఆలోచిస్తూంది.

ముకుందరావుకి నిద్రపట్టటంలేదు.

"ఆమె యెందుకు ఉద్యోగంచెయ్యాలి? ఆమె భర్త యేమను కుంటాడు? జీవితం ఎన్నాళ్ళిలా గడపాలి? 'ఇద్దరు పిల్లలతల్లి'లా ఆమె

మాత్రం అయిపోదూ. ఎన్నాళ్ళిలా....ఎన్నాళ్ళిలా....ఏమిటీ జీవితం?"

మర్రోజు ప్రొద్దున్నే ముకుందరావు కాగితం, కలం తీసుకున్నాడు. టెంపరేచర్ నార్మల్‌లో వుంది.

సాయంకాలం ఆమె వచ్చింది. సంతోషంగా వచ్చింది. "మీకు జ్వరం తగ్గిపోయింది. టెంపరేచర్ చార్ట్ చూసివచ్చాను. నాలుగు రోజుల్లోనే మీరిక్కడనుంచి హాయిగా వెళ్ళిపోవచ్చును."

ముకుందరావు నవ్వాడు.

ఆమెకు తాను గీసిన బొమ్మ చూపాడు.

"ఉద్యోగం వదిలేసిన నర్సు."

ఆ బొమ్మలో తానేవుంది. ఎవరో మగవాడు. తనచుట్టూ ఇద్దరు ముగ్గురు పిల్లలు. వాళ్ళను పిల్లలనుకోవాలి. రేఖలు.

ఆమెకు సంతోషమైంది. అతడికేసి ఆశ్చర్యంగా కళ్ళు విప్పార్చుకొని చూసి "మీరు బొమ్మలు బాగా వేస్తారే!"

ఇంకా కళ్ళు పెద్దవిచేసి, "నాకు ఇల్లులేదు. సంసారం లేదు, పెళ్ళికాలేదు తెలుసా?" ఆమె వెళ్ళిపోయింది. ఆ బొమ్మగీసిన కాగితం జాగ్రత్తగా తీసుకుని, పోతూ పోతూ, "ఇది నాకు కావాలి." అంది.

ముకుందరావుకి ఆశ్చర్యమైంది. సంతోషం కలిగింది. ఆవాళ రాత్రి ఎదురు బెడ్‌మీదవున్న కుర్రవాడు మళ్ళీ యేడ్చాడు. ఆమె వచ్చింది. "ఎందుకమ్మా ఏడుస్తున్నావు? నేనే అమ్మననుకో!" ముకుందరావు ఆమె వేపు చూస్తున్నాడు. రోజూ కుర్రవాడు యేడుస్తున్నాడు, రేపు వెళ్ళిపోతాననగా, ఆ రాత్రి ఆమె వేటిని కావాలని మృదువుగా నొక్కి హాయిగా నిద్రపోయాడు ముకుందరావు. ఇది క్రిందటిసారి వానలో తడిసిన కథ. ఇప్పుడు.

ముకుందరావు రోడ్డుమీద నడుస్తున్నాడు. బ్రిడ్జి వచ్చింది. బ్రిడ్జి దాటాడు. ఏవీ దుకాణాలులేవు. గవర్నమెంటు క్వార్టర్స్ కనిపిస్తున్నాయి. ఒక పెద్ద చినుకు వచ్చి మీద పడింది. ముకుందరావు పదుగెత్తాలనుకున్నాడు. నడుస్తున్నాడు. గాలి చల్లగా శరీరాన్ని తాకుతున్నది. మీద రెండు చినుకులు పడ్డాయి. ముకుందరావు గబగబా నడుస్తున్నాడు.

నాలుగు చినుకులు పడ్డాయి. ముకుందరావుకి హాయిగానేవుంది. అయినా భయంగావుంది. ఇంకా నడక వేగం హెచ్చించాడు.

వీథిలో దీపాలు వెలిగాయి. చీకటిపడుతున్నది. వాన కురవ పోతున్నది. ఒకచెట్టు కనపడుతున్నది. ఆ చెట్టుకింద అప్పటికే ఒకరు నిలుచుని వున్నారు. చిన్నపళ్ళెంలో యేవో అమ్ముకునేవాడులావుంది. ముకుందరావు పోయి పక్కనే నిలుచున్నాడు. చినుకులు పడుతున్నాయి. ముకుందరావుకి విసుగ్గావుంది. ఎదురుగా క్వార్టర్సు కనపడుతున్నాయి, క్వార్టర్సులో దీపాలు కనపడుతున్నాయి. వాన కురుస్తున్నది. తనపక్కన నిలుచున్న మనిషివేపు చూశాడు. అతనిపైన చినుకులు పడటంలేదు. అతని చేతుల్లోని పళ్లెంవేపు చూశాడు. వేయించిన సెనగలు వున్నవి. ముకుందరావు జేబు తడుముకున్నాడు. ముకుందరావుపక్కన నిలుచున్న మనిషి పక్కకి జరిగాడు. ముకుందరావు శనగలు కొనుక్కొని జేబులో పోసుకున్నాడు. ఇప్పుడు ముకుందరావుమీద చినుకులు పడటంలేదు. పక్కనున్న మనిషి పళ్ళెంమీద గోనెపట్టా కప్పుకుని క్వార్టర్సువేపు పరుగెత్తాడు. ముకుందరావుకి హాయిగావుంది. ఒక నిమిషం, రెండు నిమిషాలు. వాన పెద్దదైంది. ముకుందరావు క్వార్టర్సువేపు పరుగెత్తాడు.

సెనగలమ్ముకుంటున్న మనిషి ఏ యింట్లోనూ కనిపించలేదు. అన్ని వాకిళ్లూ మూసివున్నాయి. ముకుందరావు తడుస్తున్నాడు. వాన పెద్దదైంది.

చప్పున వో ఇంటిదగ్గర ఆగిపోయాడు. వాకిలి తెరిచేవుంది. గడపలో నిలుచున్నాడు. వాన మీదపడటంలేదు. జేబురుమాలుతో తల తుడుచుకుంటూ ఇంట్లోకి చూశాడు. లైటు వెలుగుతోంది. సోఫాలో ఎవరో అమ్మాయి కూచుని కథల పత్రిక చదువుతోంది. ఆ అమ్మాయి ముకుందరావువేపు చూసింది. కళ్ళలో యెంతో అసహ్యం— ఆ అమ్మాయి తన వేపు చూడటంలో. ఆ అమ్మాయి చదువుతున్న కథవేపు చూశాడు ముకుందరావు. చిత్రం. ఆ కథ తాను వ్రాసిందే. ఆ అమ్మాయి మళ్ళీ చదువుకుంటోంది. ఆ అమ్మాయివేపు చూశాడు. ఆ అమ్మాయిముఖం దీనంగా మారిపోయింది. ఆ దుఃఖగాథను తలచుకుని, ఆ అమ్మాయిని చూస్తూ ముకుందరావు చెప్పలేనంత సంతోషపడ్డాడు. ఆ అమ్మాయి చప్పున ఇతడివేపు తిరిగి "పక్కన వరండా వుంది. అక్కడ పోయి

నిలుచోండి..." ముకుందరావుకి దిగులైంది. ఆ కథ తానే వ్రాసిందే! ముకుందరావు కదలబోయాడు.

వెనకనుంచి "ఓ....మీరా...."

క్షణంసేపు ఆగి "వానలో తడుస్తున్నారా?" కోపంతో కూడిన లాలనతో.

ఆమె సరోజిని. అప్పుడే లోపలినుంచి వచ్చింది.

"కూచోండి టవల్ తెస్తాను. మా మరదలే లెండి....నువు పోయి కాఫీ కలుపమ్మా...."

ముకుందరావు గోడవారగా నిలుచున్నాడు. సరోజినిమరదలు లోపలకు వెళ్ళింది. చాలా ఆశ్చర్యంతో, కొంచెం బాధతో, కొంచెం సిగ్గుతో.

"మీ కథను రోజూ చదువుతుంది. చాలా ఇష్టం ఆవిడకు."

ముకుందరావు మాటాడలేదు.

"నేను ఉద్యోగంమానేశాను తెలుసా?" ఆమె నవ్వుతోంది.

"ఇప్పుడు చెప్పండి. నాకు భోజనం యేర్పాటుచేస్తారా?"

ముకుందరావుకి సంతోషమైంది. సరోజిని టవల్ తెచ్చియిచ్చి లోపలకు వెళ్ళిపోయింది. ముకుందరావు తుడుచుకోవటంలేదు. ముకుందరావుకి యెన్నెన్నో గుర్తువస్తున్నాయి. అమ్మకు ఉత్తరం వ్రాయాలి. రెండు రోజుల క్రితం గోవిందు చెప్పిన ఉద్యోగంవిషయం గట్టిగా కనుక్కోమని చెప్పాలి. ఉత్తరం....ఉత్తరం. అమ్మకు..... ముకుందరావు కాసేపు సరోజిని నిష్క్రమించిన వాకిలివేపు చూశాడు. లోపల స్టవ్ మండుతోంది. ఆ అమ్మాయి వదిలేసిపోయిన పత్రికవేపు చూశాడు. బయట కురుస్తున్న వానవేపు చూశాడు. ముకుందరావు ఆలోచించుకొన్నాడు. సరోజిని రాలేదు.

ముకుందరావుకి సంతోషం పొంగిపోతోంది. గోవిందుదగ్గరకు పోవాలి. అమ్మకు ఉత్తరం వ్రాయాలి. లోపల స్టవ్ మండుతోంది. ఎవరూ బయటకురాలేదు. రెండు మూడు నిమిషాలుకూడా గడవకముందే ముకుందరావు రోడ్డుమీద తడుస్తూ నడుస్తున్నాడు.

—:o:—

# వేలుపిళ్లై

సి. రామచంద్రరావు

రెట్టింపు బరువువేసుకొని లారీ మూలుగుతూ కొండ ఎక్కి ఎస్టేటు పెద్దబజార్లో ఆగింది. పేరుకి పెద్దబజారుకాని ప్రాస్పెక్ట్ టీ ఎస్టేటు పెద్ద బజార్లో నాలుగే నాలుగు దుకాణాలు. రెండు కిరాణా దుకాణాలు, ఒక కాఫీ "క్లబ్బు." నాలుగో దుకాణంలో ఒకభాగం మంగలి షాపు, రెండోభాగం జోళ్ళషాపు. దుకాణాల్లో మనుషులు గుమ్మంలోనుంచి బయటికి తొంగిచూసి, "సామాన్లువచ్చాయ్" అన్నారు. డ్రైవరు దిగి గాలికి లారీ ఇంజను చల్లారడానికి బోనెట్ తెరిచిపెట్టాడు. రెండో పక్క తలుపు తెరుచుకుని గోపాలచెట్టియార్ కులాసాగా నవ్వుతూ కిందికి దూకాడు. అప్పటి కప్పుడే రోడ్డుప్రక్కల కబుర్లుచెప్పుకుంటున్న పనిలేని కుర్రాళ్ళు అయిదారుగురు లారీచుట్టూ మూగారు.

"ఏరా శనిగ్రహాల్లారా, అప్పుడే నేనొచ్చినట్టు పసికట్టేశారా?" అని గట్టిగా నవ్వాడు గోపాలంచెట్టియార్. లాల్చీజేబులోనుంచి ఒక కట్ట బీడీలు పైకితీసి తలో నాలుగూ పంచిపెట్టాడు.

"అగ్గిపెట్టికూడా ఇప్పించండి" చనువుగా అడిగాడు ఒక కుర్రాడు.

"ఓరి కుక్కా, బీడీ ఇచ్చిందికాకుండా అగ్గిపెట్టికూడా తెమ్మంటావా? తీసుకో, పో."

అగ్గిపెట్టెతీసి కుర్రాడి చేతులో పెట్టాడు చెట్టియార్. చెట్టియార్ తిట్లలో ఆగ్రహంకాని, అసహ్యంకాని లేదు. అతను వాళ్ళను పలకరించే తీరే అంత.

"మా సోమరిపోతు వెధవల్ని చూశారండి," లారీలో ఎత్తుగా వేసిన సామానులమీద నిశ్చింతగా నిద్రపోతున్న ఇద్దరుమనుషుల్ని చూపిస్తూ అన్నాడు చెట్టియార్, "ఒరే కడలేశా, వాళ్ళని కొంచెం లేపరా బాబూ. మిమ్మల్ని చూసి బుద్ధయినా తెచ్చుకోమంటాను."

కొందరు కుర్రాళ్ళు పర్సంపడితే సామాన్లు తడవకుండా కప్పిన టార్పాలిన్ తాళ్ళని విప్పడం మొదలుపెట్టారు. ఒకళ్ళిద్దరు, "ఇరులప్పా, కరుప్పయ్యా" అని నిద్రపోతున్నవాళ్ళని లేపడానికి ప్రయత్నించారు. గోపాలచెట్టియార్ రేగిన బట్టతలని చేత్తో సరిచేసుకుని, తెల్లటిలాల్చీమీద జరీ ఖండువాని తడిమిచూసుకుని, సిల్కు అద్దపంచె జారిపోకుండా ఇంకొకసారి బిగదీసి కట్టుకుని పుంటపోసం చేస్తూ, వేలుపిళ్ళై దుకాణానికి దారితీశాడు.

"నమస్కారం షావుకారుగారూ."

రోడ్డు కవతలివైపునవున్న టీ 'క్లబ్బు' లో నుంచి మునుసామి గౌండర్ చేతులు జోడించాడు.

"ఏం గిరాకీ, గౌండర్. అంతవేళ అవుతున్నావ్, టీనీళ్ళు పోస్తావా?"

తమలపాకులు నమిలి నమిలి గారపట్టిన పళ్ళు ఎర్రటి పెదాల్లోనుంచి చూపిస్తూ వేళాకోళం చేశాడు చెట్టియార్. ఏదో విశేషం ఉండా లనుకుని రోడ్డు కిటుపక్కగా వెళ్ళాడు.

"ఏమయ్యోవ్, పెద్దమనిషి, ఈసారికూడా బాకీ వాయిదావేద దామని ఎత్తువేస్తున్నావేమో, కుదరదు." చెట్టియార్‌కి హాస్యధోరణిలో మాట్లాడటం అంటే ఇష్టం. నిజానికి అతను బాకీగురించి ఆలోచించడమే లేదు. చెట్టియార్ ప్రతి శుక్రవారం అపరాలూ, కాయగూరలూ, చిల్లర సామానూ లారీలో తీసుకువచ్చి, ఏనమలై కొండల ఎస్టేట్ల బజార్లలో చిల్లర షావుకార్లకి అమ్ముతూ ఉంటాడు. సరుకులకి వారం వారం ధర వసూలుచెయ్యడంపద్ధతి లేదు. అడపా తడపా, ఎప్పుడు వీలుగావుంటే అప్పుడు పుచ్చుకోవడమే. బాకీల్లో కొంత భాగం రాకపోయినా నష్టం లేకుండా ధరలు నిర్ణయించుకు అమ్ముతుంటాడు.

"ఎంతమాట సెలవిచ్చారయ్యా, ఈ వారం ఇచ్చేస్తానని చెప్పిం తర వాత మాట తప్పడానికి వీలవుతుందా?" అన్నాడు గౌండర్.

"ఇదెప్పటినుంచి మొదలుపెట్టేవ్ గౌండరయ్యా? అయితే నువ్వు ఆడితప్పవన్నమాట." గౌండర్ వీపు చరిచాడు చెట్టియార్. అతని

వేళ్ల ఉంగరాల దొంతర్లు గౌండర్ ఎముకలకి గుచ్చుకున్నాయి. వీపు తడుముకుంటూ గౌండర్ అన్నాడు.

"కొంచెం టీ తాగిపోతారేమోనని పిలిచాను."

ఈసారి చెట్టియార్‌కి నిజంగా ఆశ్చర్యంవేసింది. ఈ పిసినారి గౌండర్ టీ తాగమని అడగడమేమిటి, బాకీ అడిగీ అడక్కుండానే చెల్లించేస్తాననడమేమిటి! తమాషాకి టీనీళ్ళు పోస్తావా అన్నాడు కాని నిజంగా తను గౌండర్ దుకాణంలో తాగుదామని కాదు. భోజన పానాలు తనెప్పుడూ వేలుపిళ్ళైఇంట్లోనే చేస్తాడని గౌండర్‌కి తెలుసుకదా.

"అబ్బే, ఎందుకూ శ్రమ. నాకోసం వేలుపిళ్ళై చేసి వుంచుతాడుగా," అన్నాడు చెట్టియార్.

"శ్రమేమిటి, తమలాంటివారికి ఆతిథ్యమివ్వడం కుదరాలేకాని, తమ దయఉంటే ఇకనుంచి సౌకర్యాలన్నీ నేనే చూస్తాను." కొంచెం సేపు ఆగి గౌండర్ మళ్ళీ అన్నాడు.

"సెందామరై చచ్చిపోయిందిగా."

"ఆ!" తన చెవులు తనే నమ్మలేకపోయాడు చెట్టియార్.

"మొన్న శుక్రవారం నే వచ్చినప్పుడు బాగానే ఉంది. ఇంతలోకే ఇంత అన్యాయమా?"

"తమరు వెళ్ళిపోయిన మర్నాడు హఠాత్తుగా పోయింది."

"నే వెళతా," లేచాడు చెట్టియార్.

"వేలుపిళ్ళై ఇంట్లోలేడు," అన్నాడు గౌండర్.

"ఎక్కడున్నాడు?"

"పోయిన అయిదురోజులుగా ఆ వినాయకుడిగుడిదగ్గిర ఏడుస్తూ పడిఉన్నాడు. పాపం సెందామరై చచ్చిపోడం పెద్దదెబ్బ."

గౌండర్ కులాసాకి కారణం ఇప్పుడు చెట్టియార్‌కి అర్థమైంది. ఆ బజార్లో వేలుపిళ్ళైకీ గౌండర్‌కీ పోటీ. ఇద్దరికీ కిరాణా దుకాణం ఉంది. గౌండర్ టీ "క్లబ్" కూడా నడుపుతున్నాడు. అయినా అమ్మకంలో వేలుపిళ్ళైదే పైచెయ్యి. వేలుపిళ్ళై నమ్మకస్థుడనీ, న్యాయస్థుడనీ, మాటమర్యాదకలవాడనీ పేరు. గత మూడుసంవత్సరాలుగా చెట్టియార్

స్నేహం కలిశాక వ్యాపారం బాగా వృద్ధికూడా అయింది. అతని పచ్చదనం గౌండర్‌కి ఎప్పుడూ కన్నెర్రగా వుంటూనే వచ్చింది. ఇప్పుడు సెందామరై పోయి వేలుపిళ్ళై ఏడుస్తుంటే పోటీలేకుండా వ్యాపారం వృద్ధిచేసుకోడానికి కలలుకంటున్నట్లున్నాడు గౌండర్.

చెట్టియార్ వేలుపిళ్ళైదుకాణంలో అడుగుపెట్టేసరికి పనికుర్రాళ్ళు, నలుగురైదుగురు ఎస్టేటు కూలీలు కలిసి పచ్చీసు ఆడుకుంటున్నారు. చెట్టియార్‌ని చూసి లేచి నుంచున్నారు.

"దుకాణం తెరవనైనా లేదే," అడిగాడు చెట్టియార్,

"యజమాని తెరవొద్దన్నారు," అన్నాడు పనికుర్రాడు.

చెట్టియార్ వేలుపిళ్ళైఇంట్లోకి వెళ్ళి లోపలి ద్వారంలోనుంచి కొట్టులో ప్రవేశించాడు. కాబేజ్, కాలీఫ్లవర్, పీస్, బంగళాదుంపలు, ములక్కాడలూ – తను పోయినవారం ఇచ్చిన కాయగూరలన్నీ ఎండిపోతూ పడిఉన్నాయి. విప్పినమూటల్లో పప్పూ, బియ్యం ఎలుకలు చెల్లాచెదరుచేశాయి. చెట్టియార్‌కి వేలుపిళ్ళైని తలుచుకుంటే జాలివేసింది. పనికుర్రాళ్ళమీద కోపంవచ్చింది. విసురుగా బయటికివచ్చి అరిచాడు.

"యజమాని కష్టాల్లోఉండి కొట్టుతెరవొద్దంటే గంగిరెద్దుల్లాగా తల ఊకొట్టి పచ్చీసుఆడుకొంటున్నారన్నమాట. ఈ కాయగూరలన్నీ ఎలా ఎందుకూ పనికిరాకుండాపోయాయో చూడండి." ఈపాటికి చెట్టియార్ రాక విని పంచాయితీ పెద్దలు కొళందవేలూ, ఆశీర్వాదం, కొండాయి, ఇంకా ఎస్టేటు కూలీల్లో పెద్దా చిన్నా వేలుపిళ్ళై దుకాణం దగ్గిర గుమిగూడేరు.

"కుర్రోళ్ళ తప్పునేదు. ఏలుపిల్లే నసేమిరా కొట్టుతియ్యనని పట్టట్టికూసున్నాడు," అన్నాడు కొండాయి.

"ఇంత గంజినీల్లయినా పొట్టలో ఓసుకోకుండా గుడికాడ పడిగాపులు కాత్తన్నాడు. సత్తాడో ఏమో," అన్నాడు కొళందవేలు.

"నిజంగానా?" అడిగాడు చెట్టియార్.

"నిజంకాపోతే అబద్దమేటీ? ఎవురేనా కూడు అట్టికెల్తే తోసేత్తాడు. ఇంత టీ తాగి నెట్టుకొత్తన్నాడు."

"వినాయకుడిగుడి ఎక్కడో చూపించండి," అన్నాడు గోపాల చెట్టియార్.

అందరూ గుడివైపు బయల్దేరారు.

"ఈ గుడి లేకాకనే కాదూ వేలుపిళ్లైని దసలచ్మి వారించింది," అన్నాడు పెన్నాసియుక్తు.

"గుడేనేటి, సెంబామర్రై అదృట్టం తేలేదేటి?" అన్నాడు కొండాయ్.

గోపాలచెట్టియార్ విని ఊరుకున్నాడు. నాలుగేళ్ళుగా అతను ఆనమర్రై ఎస్టేట్లో వ్యాపారం చేస్తున్నాడు. గత మూడేళ్ళల్లోనూ అతనికి వేలుపిళ్ళైతో మంచి స్నేహం కుదిరింది. తనూ వేలుపిళ్ళై మొదటిసారి కలుసుకోడం, వేలుపిళ్ళై సెందామరైని తీసుకురావడం నాలుగయిదునెలల తేడాలో జరిగాయి. సెందామరైకి పూర్వం వేలుపిళ్ళైకి ఇంకొక పెళ్ళాం ఉండేదట. వేలుపిళ్ళై ఎన్నోసార్లు చెప్పిన పాతకథంతా చెట్టియార్ తలలో మెదిలింది.

వేలుపిళ్ళై పది పన్నెండేళ్ళక్రితంవరకూ ప్రోస్పెక్టు టీ ఎస్టేటులో కూలీగా పనిచేస్తూఉండేవాడు. ఒకసారి ఎస్టేటు కండక్టరుతో మాటామాటా వచ్చి, "నువ్వెంత, నీవనెంత" అని పని మానేసి వ్యాపారంలో దిగేడు. వ్యాపారం అంటే వందలమీదా వేలమీదాకాదు. కొండల కింద ఉన్న పొల్లాచీ సంతలో లక్ష్మీవారాలు అమ్ముడైపోగా మిగిలిన ఉల్లిపాయ, చింతపండు, కాయగూరలూ కొని ప్రోస్పెక్టు ఎస్టేటు కూలీలకి లాభాలకి అమ్మేవాడు. అతనంటే కిట్టని కండక్టరుకి ఇది కంటకంగా ఉండేది. అనధికారంగా లైసెన్సు లేకుండా - దుకాణం పెట్టినందుకు అధికారులకి అప్పజెప్పుతానని బెదిరించాడు. కాని, ఇప్పుడున్న దుకాణం కండక్టరు జాడ చూచాయగా తెలియగానే మాయమైపోయేది. అంగడి చిన్న చేతిసంచీలో ఇరుక్కుపోయేది. తిరిగి కండక్టరు వెళ్ళిపోగానే దుకాణం తయారు. ఇలా సాగుతున్నా అతని కిది నచ్చలేదు. అతనిమీద అభిమానంఉన్న కొందరు కూలీలు ఎస్టేటుమేనేజరు దగ్గిరకి పోయి ఇంకొక చిల్లరదుకాణం కావాలని విన్నపంచేసుకొన్నారు. వేలుపిళ్ళైకి ఆ దుకాణం నడపడానికి అనుమతి ఇమ్మని కూడా కోరుకున్నారు.

ఫలితంగా వేలుపిళ్ళై,,మునుసామి గౌండర్‌కి పోటీగా పెద్దబజార్లో అంగడి ప్రారంభించాడు.

ఇప్పటి ఉధృతం లేకపోయిందేమో కాని, వేలుపిళ్ళై వ్యాపారం అప్పుడు కూడా లాభసాటిగా లేకపోలేదు. ఏడాది తిరగకుండా అతను పెళ్లిచేసుకున్నాడు. తరువాత మూడు నాలుగేళ్ళల్లో భార్యకి మెడనిండా బంగారపు వస్తువులు చేయించాడు. కంచి చీరలు కొన్నాడు. అద్దాలు అతికిన పందిరిపట్టిమంచం కొన్నాడు. రెండుమూడు కుర్చీలు చేయించాడు. వేలుపిళ్ళైకి సిరి అబ్బడంతో తనపేరు చిరస్థాయి చేసుకోవాలని కోరికపుట్టింది. పేరు శాశ్వతంగా నిలిచే దానం ఏదైనా చెయ్యడానికి నిర్ణయంచేసుకుని ఎస్టేటు కూలీలతో సంప్రదించాడు. వినాయకునిగుడి కావాలని అడిగారు కూలీలు. 'సరే'అన్నాడు వేలుపిళ్ళై. ఇలా డబ్బు దుబారా చెయ్యడం వేలుపిళ్ళైభార్య పవనాళ్‌కి నచ్చలేదు. పవనాళ్‌ఇష్టంలేందే వేలుపిళ్ళై ఏపనీ చెయ్యడానికి వీల్లేదు. అంగడిమీద వచ్చే ఆదాయం ప్రతి సాయంత్రం పవనాళ్ లెక్కలుకట్టి తీసుకుని దాచేది. ఇంటిపెత్తనం అంతా ఆవిడదే. అసలు ఆవిడ వేలుపిళ్ళై తిండీ బట్టా కూడా సరిగ్గా చూడదని వదంతి. అతను గడించిందంతా నగలకీ, బట్టలకీ, పుట్టింటి వాళ్ళకీ ఖర్చుపెట్టేదట. దీంట్లో ఎంత నిజం ఉందో దేవుడికి ఎరుక! ఒక్కమాట మాత్రం నిజం. వేలుపిళ్ళై పవనాళ్ ఎప్పుడూ కీచులాడు కొంటూ ఉండేవారు. ఒకటి రెండు సార్లు పవనాళ్ మొగుడిమీద కోప గించి మూటా ముల్లే సర్దుకొని పుట్టింటికి పారిపోయింది. తిరిగి రెండు మూడు వారాల తరువాత వచ్చినప్పుడు వేలుపిళ్ళై ఏలుకోనని భీష్మించి కూచున్నాడు. అప్పుడు ఎస్టేటుకూలీలు పంచాయతీ ఏర్పాటుచేసి, పవ నాళ్‌ని మందలించి ఇద్దరికీ రాజీకుదిర్చారు.

పవనాళ్‌తో వేలుపిళ్ళై గుడివిషయం కదిపినప్పుడు ఆవిడ విరుచుకుపడింది.

"నా ఇల్లు గుల్లచెయ్యడానికి చూస్తున్నావు" అంది. "నా పిల్లలు నాశనమైపోతే చూసి ఆనందించాలనుకొంటున్నావు" అని అరిచింది. అప్పటినుంచీ కొన్నాళ్ళు అతనికి వేళకి స్నానానికి నీళ్ళుపెట్టడం, భోజనసదుపాయం చూడడం మానేసింది. ఇంకొక విషయం ఏదైనా

అయితే వేలుపిళ్ళై పట్టువిడిచేసేవాడు. ఇది దేవుడితోపని. వినాయకుడి గుడి కట్టిద్దామనుకున్న తరువాత తిరుగులేదు. తప్పులెక్కలు చూపించీ, కొందరు ఖాతాదారులతో లోపాయకారీగా ఒడంబడికలు చేసుకునీ, తన అవసరాలు తగ్గించుకొనీ, ఆదాచేసిన డబ్బుతో గుడికట్టడం ప్రారంభం చేశాడు. చాలాకాలంవరకూ ఈ విషయం పవనాళ్ చెవిని పడనియ్య లేదు. చివరికి ఆవిడకు తెలిసినపుడు ప్రళయంబద్దలయింది. ఒకవారం రోజులు వేలుపిళ్ళై టీ "క్లబ్బు"లో ఆకలి దప్పికలు తీర్చుకున్నాడు. ఆనాటినుంచీ వేలుపిళ్ళై చేతిలో డబ్బుఆడడం మానేసింది. అప్పటికి గుడిఉపరిభాగం తయారై ఉంది. నిజానికి దాన్ని గుడి అనడానికి వీల్లేదు. అసలు వేలుపిళ్ళై సంకల్పం కూడా వినాయకుడివిగ్రహాన్ని ప్రతిష్ఠించి, దాన్ని ఎండావానల నుంచి కాపాడేందుకు చిన్న గోపురం కడదామని. అందుకు అనుగుణంగా ముందు గోపురంలేచింది. మధురైనుంచి నలుగురు శిల్పుల్ని పిలిపించి పని పూర్తిచేయించాడు వేలుపిళ్ళై. చిన్న కొండమీద వందఅడుగులు చదునుచేసి ఆరడుగుల చదరంలో గోపురాన్ని లేవదీశారు. మూడడుగుల ఎత్తున అరుగు; దానిమీద నాలుగు రాతిస్తంభాలు; ఆ స్తంభాలమీద చిన్నగోపురం. గోపురంమీద రంగురంగుల విగ్రహాలు; శివుడు, వినాయకుడు, నంది, మూషికం, ఏనుగులు. ఆ విగ్రహాలకింద పెద్దఅక్షరాలతో "వేలుపిళ్ళై ధర్మం," అని చెక్కడం, దాని పక్కన దానంచేసిన సంవత్సరం, తేదీ. రోజూ నాలుగయిదుసార్లు వెళ్ళి తనపేరు చూసుకుని మురిసిపోయేవాడు వేలుపిళ్ళై. ఇంతవరకూ వచ్చినతరువాత విగ్రహం ప్రతిష్ఠించడానికి డబ్బు లేకపోవడం అతన్ని క్రుంగదీసింది.

విగ్రహం ప్రతిష్ఠించడం అంటే మాటలతోపనికాదు అన్నారు అతను సంప్రదించిన బ్రాహ్మణులు. వినాయకుని ప్రతిష్ఠ శాంతి కోరుతుంది. నాలుగయిదు వేల రూపాయలైనా కావాలి. తనదగ్గిర పట్టుమని పది రూపాయలైనా లేవు. విచారంతో కృశించిపోతున్న వేలుపిళ్ళైకి ఎవరో ఒకఉపాయం చెప్పారు. ఒకసారి ప్రతిష్ఠించిన విగ్రహాన్ని దొంగిలించి తీసుకువచ్చినట్టయితే శాంతి అవసరంలేదు. అందరి మంచి కోసం చేసినపని దొంగతనంలోకి లెక్కకిరాదు. పైగా, గర్భగుడిలో

విగ్రహాన్ని దొంగిలించడంలేదు. ఏ పెద్దశివాలయంలోనో బయట నిరాదరణగా పడిఉన్న విగ్రహాన్నే ఏరుకుంటున్నాడు. గుండె దిట్టపరుచుకుని కొన్నత్తూరు శివాలయంఆవరణలో వినాయకవిగ్రహాన్ని తీసుకురావడానికి నిశ్చయంచేసుకున్నాడు. దానికిమాత్రం తక్కువ అవుతుందా? ముగ్గురు నలుగురు తోడులేకుండా రాత్రిపూట విగ్రహం సంగ్రహించడం వీలయేపనికాదు. శాంతి అక్కర్లేకపోయినా సాధారణంగా శాస్త్రోక్తంగా ప్రతిష్ఠించడానికీ, బీదా సాదాకి అన్నదానంచెయ్యడానికీ వెయ్యా పదిహేనువందలకి తక్కువగాదు. తల ఆలోచనలతో బద్దలుచేసుకున్నాడు వేలుపిళ్ళై. తనకున్న ఆస్తిఅంతా పెళ్ళాంమెళ్ళో ఉంది. నగలు తాకట్టుపెట్టి ఈ సమయంలో ఆదుకుంటే నెమ్మదిగా విడదీసుకోవచ్చు. పవనాళ్ ఒప్పుకుంటుందనే ఆశ లేదు. శుభకార్యంకోసం చిన్న అబద్ధంఆడడంలో తప్పులేదని సమాధానపడ్డాడు వేలుపిళ్ళై. మంచి పొలం అమ్మకానికి ఉందనీ, కొనడానికి అప్పుగా రెండువేలు అవసరంగా కావాలనీ పవనాళ్ తండ్రి రాసినట్టు జాబురాసి పోస్టుచేశాడు. మర్నాడు పవనాళ్‌కి ఉత్తరం చదివి వినిపిస్తున్నప్పుడు, అప్పుదగ్గిర ఆపి కోపం అభినయించాడు. ఆనాడూ మర్నాడూ పవనాళ్ అతనికి తియ్యటి మాటలు చెప్పింది. అతను స్నానంచేసినప్పుడు వీపురుద్దింది. తమలపాకులకి సున్నంరాసి ఈనెలుతీసి ఇచ్చింది. ఎన్నోవిధాలుగా అతన్ని సుముఖుణ్ణి చేసుకోడానికి ప్రయత్నించింది. బెట్టుచేసి చివరికి నగలు తాకట్టుపెట్టడానికి సమ్మతించాడు వేలుపిళ్ళై.

నగలు చేతబట్టుకుని ముగ్గురు నమ్మికైన స్నేహితులతో వేలుపిళ్ళై కొన్నత్తూరు ప్రయాణమయ్యాడు. దారిలో పొల్లాచీలోని మార్వాడీదగ్గిర నగలు తాకట్టుపెట్టి, డబ్బు అడ్డపంచె జారిపోకుండాపెట్టుకున్న వెడల్పాటి తోలుబెల్టుకిఉన్న రహస్యపుఅరలో దాచుకున్నాడు. మళ్లీ నలుగురూ ప్రయాణం సాగించారు. కొన్నత్తూరు చేరుకునేసరికి రాత్రి పదకొండు గంటలయింది. సరాసరి శివాలయానికి పోయి వినాయకునివిగ్రహాన్ని పెకలించి భద్రపరుచుకుని బయటపడ్డారు. అంతా సవ్యంగా జరిగిపోయిందని నలుగురూ సంతోషంగా కబుర్లాడుకుంటున్న సమయానికి తమపక్కనుంచి ఎవరో దూసుకుపోయారు. వెనక కొంచెందూరంలో

కొందరు, "దొంగ, దొంగ, పట్టుకోండి" అని అరుస్తూ తరుముతున్నారు. వేలుపిళ్ళైకీ స్నేహితులకీ పరిస్థితి అర్థమైంది. తాముకూడా పలాయనం చిత్తగించడం ఉత్తమమనిపించింది. స్నేహితులు ముగ్గురూ యౌవనంలో ఉన్నవాళ్ళు. బాగా పరిగెత్తగలిగారు. వేలుపిళ్ళైకి యాభైదాటి దేహ దార్ఢ్యం సన్నగిల్లింది. దానికితోడు చేతిలో బరువైన వినాయకుడి విగ్రహం. కొన్నిగజాలు వెళ్ళేలోపలే అతనికి ఆయాసంవచ్చేసింది. పరుగుమానేసి ఇటూ అటూ పరికించిచూశాడు. వీధి మురికికాలవకి అవ తలపైపున గాలికిఎగిరిపోయేలా వున్న గుడిసె చూచాయగా కనిపించింది. ఏమయితే అయిందని దాంట్లో దూరాడు. తరుముకొనివస్తున్న జనం గుడిసె దాటిపోయిన కొంతసేపటికికాని అతను ఏమి చెయ్యడానికీ ధైర్యం చెయ్యలేదు. నెమ్మదిగా బీడీ అంటించి, అగ్గిపుల్ల వెలుగులో గుడిసెని పరిశీలించడానికి ఉపక్రమించాడు. ఏమీ అంతుపట్టకుండానే అగ్గిపుల్ల ఆరి పోయింది. బీడి ఎగపీల్చి ఆ కాంతిలో ఆకారాలు గుర్తుపట్టడానికి ప్రయ త్నించాడు. కొంతసేపటికి విసుగుపుట్టి గుడిసెలో అటూ ఇటూ తిరగడం ప్రారంభించాడు. గుడిసెమూలనుంచి ఆడగొంతు అడిగింది.

"ఎవరు నువ్వు?"

ఆ గొంతులో తొందరకాని భయంకాని లేవు. వేలుపిళ్ళైకి కొంత ధైర్యంవచ్చింది.

"ష్, మాట్లాడకు," అన్నాడు.

ఈసారి అగ్గిపుల్లవెలిగించి, "దీపం ఎక్కడ?" అని అడిగాడు.

"దీపంలేదు," అంది గొంతు.

వెలిగించిన అగ్గిపుల్ల ఆమెమొహందగ్గిర ఉంచి అడిగాడు.

"నువ్వొక్కదానివేనా ఉండేది?"

"అవును."

అగ్గిపుల్ల ఆరిపోయింది. వేలుపిళ్ళై ఇంకొకటి వెలిగించలేదు. చీకట్లో తనకథ చెప్పేడు. రాత్రికి ఒకమూల పడుకోనిస్తే మర్నాడు వెళ్ళిపోతానన్నాడు.

"ఒకమూల పడుకొనిఉండడు. వెచ్చగా సెందామరై కౌగిట్లో బిగదీసుకుని గడిపిఉంటాడు. ముసలాడు సరిగ్గా చెప్పడు."

గోపాలచెట్టియార్‌కి ఇంత విచారసమయంలోకూడా నవ్వొచ్చింది. తన చుట్టుప్రక్కల అంతా వేలుపిశ్శై గురించ, సెందామరై గురించీ ఏవేవో మాట్లాడుతున్నారు. అతనుమాత్రం ఏమీ వినడంలేదు. మళ్లీ అతని ఆలోచనలు వేలుపిశ్శై ఎన్నోసార్లు తనకి చెప్పిన స్వీయ కథమీదకి మళ్లాయి.

సెందామరైని తీసుకువచ్చి ఇంట్లోపెట్టుకునే ధైర్యం లేకపోయింది వేలుపిశ్శైకి. పొల్లాచీలో చిన్న ఇల్లుకుదిర్చి ఉంచాడు. రెండు రోజులకీ మూడురోజులకీ ఏదో సాకుమీద పొల్లాచీ వెళ్తూఉండేవాడు. ఒక్కొక్కప్పుడు కొండకిందకు పోతున్న ఏ లారీ డ్రైవరు చేతిలోనో రూపాయో అర్ధో పెట్టి రెండోకంటికి తెలియకుండా పోయి వచ్చేవాడు. ఇది క్షేమంకాదని అతనికి తెలుసును. కాని దాన్నిగురించి ఆలోచించి బుర్రపాడుచేసుకోలేదు. జరిగినన్నాళ్ళయినా సుఖం అనుభవించాలిగదా!

వేలుపిశ్శై మోసంచేసి నగలు చేజిక్కించుకున్నాడని తెలుసుకోడానికి పవనాళ్‌కి ఆట్టేకాలం పట్టలేదు. ఈసారి అతనికి వంటచెయ్యడం మానెయ్యడమే కాకుండా ఏడుపులూ పెడబొబ్బలూ మొదలుపెట్టింది. దారినపోయేవారందరితోనూ ఫిర్యాదుచేసింది. చుట్టుపక్కలవాళ్ళు చూడకుండా మొగుణ్ణి అడపా తడపా చీపురుతో మొత్తింది. ఇది జరిగినరోజునే వేలుపిశ్శై పరారిఅయిపోయేడన్నారు. నిజానికి అతను సెందామరైతో పొల్లాచీలో కులుకుతూ కూచున్నాడు. వారం రోజుల తరువాత తిరిగి ఎస్టేటుకి వచ్చినప్పుడు పవనాళ్ ఇంట్లోలేదు. అంగడిలో మిగిలిన కాస్తా కూస్తా మూటగట్టుకుని పుట్టింటికి పోయింది. వేలుపిశ్శైకి నెత్తినుంచి పెద్ద బరువుదింపి నట్టయింది. "ఈ ముండ తిరిగి రాకపోతే బాగుణ్ణు," అనుకున్నాడు. ఆ తలపులో సౌఖ్యాన్ని అనుభవించకుండానే దుకాణం పరిస్థితి అతనికళ్లముందు నిలిచింది. అమ్మడానికి కొట్లో ఒక్క సామాను లేదు. పందిరిపట్టిమంచం మినహాయించి ఇంట్లో ఒక్క వస్తువు లేదు.

"ఆ శుక్రవారం నేను తటస్థపడకపోతే ఏం చేసేవాడో," అనిపించింది గోపాలచెట్టియార్‌కి ఇప్పుడు. పైన మబ్బులు కమ్ముకు

వస్తున్నాయి. ఉండుండి చిన్న తుంపరకూడా పడుతున్నట్టుంది. చెట్టియార్ నడకవేగం హెచ్చించాడు.

"గుడి ఇంకా ఎంత దూరం?" అన్నాడు.

"ఇదో ఒచ్చేసేం. ఆ మలుపు తప్పితే అగుపిస్తది," అన్నాడు కొండాయి.

చెట్టియార్ తిరిగి వేలుపిళ్ళై గురించి ఆలోచించడం మొదలు పెట్టేడు. ఆ శుక్రవారం తను బాకీలు వసూలుచేసుకోడానికి వాల్‌పాలై వెళుతున్నాడు. లారీరేడియేటర్‌లో నీళ్ళు మరుగుతున్నట్టనిపించి, మారుద్దామని దారిలో ప్రోస్పెక్ట్ టీ ఎస్టేటు బజారులో ఆగాడు. అదే తను వేలుపిళ్ళైని మొదటిసారి కలవడం. వేలుపిళ్ళై తనూ బీడీలు వెలిగించి కొండరోడ్డుపక్కన తూముమీద కూర్చుని పాతస్నేహితుల్లాగ గంటలతరబడి కబుర్లాడుకోడం చెట్టియార్‌కి బాగా జ్ఞాపకంఉంది. తన కథంతా చెప్పాడు వేలుపిళ్ళై. చెట్టియార్‌కి జాలిపుట్టింది. వేలుపిళ్ళై మీద అభిమానం కలిగింది, నమ్మకం కుదిరింది.

"మంచిముండాకొడుకు," అనుకున్నాడు చెట్టియార్. బట్ట తలమీదపడ్డ వర్షపుచినుకుని ఎడంచేత్తో తుడుచుకుంటూ.

"పిళ్ళైకి సామాను అప్పిచ్చి వ్యాపారంనిలబెట్టడంతో స్నేహం మొదలయినా, సెందామరై వల్లేకదా ఇన్నిసార్లు నేను కొండమీద కొచ్చేదీ."

పాతజ్ఞాపకాలు ఇంకా అతణ్ణి వెంటాడాయి.

సెందామరైని కలవకముందు చెట్టియార్ అప్పుడప్పుడూ బాకీలు వసూలుచేసుకోడానికి కొండలమీదికి వచ్చినప్పుడు పిళ్ళైఇంట్లో భోజనం చేసి పోతుండేవాడేకాని, ఇప్పటిలాగ ప్రతివారం సామాన్లతో తనూ ప్రత్యక్షమయ్యేవాడు కాదు.

"దిట్టమైనముండ, అందర్నీ మంచిచేసుకుంది."

సెందామరై గురించి ఆలోచించకుండా ఉండలేకపోయాడు చెట్టియార్.

సెందామరై దుకాణంమీద నవ్వులొలకపోస్తూ కూర్చోడం, చిన్నా పెద్దా వేళాకోళాలాడుతూ గంటలతరబడి కొట్టుచుట్టూ మూగి

ఉండడం, ముసలితొక్కులుసహితం సెందామరై చేతివేళ్ళని తాకుతూ బీడీలు అందిపుచ్చుకోడానికి అక్కర్లేకపోయినా కొనుక్కోడం—అంతా అతని కళ్ళకుకట్టినట్టయింది.

“నిజంగా దీని తెలివితేటలవల్ల నెగ్గుకొచ్చింది కాని పవనాళ్ అలా విరుచుకుపడినందుకు ఇంకొకతె తట్టుకోగలదా?” అనుకున్నాడు.

సామానుతో పుట్టింటికిపోయింతరువాత పవనాళ్ యథాప్రకారం రెండువారాలకో, మూడువారాలకో తిరిగి వేలుపిళ్ళైదగ్గిరకి వచ్చెయ్యలేదు. రెండుమూడునెలలకికూడా రాలేదు. ధైర్యంచేసి వేలుపిళ్ళై సెందామరైని ఎస్టేటుకి తీసుకొచ్చాడు. ఈ విషయం విన్న పవనాళ్ ఒకనాడు తండ్రిని వెంటబెట్టుకొని వచ్చి దెబ్బలాటకిదిగింది. వేలుపిళ్ళై గుండె జారిపోయింది. సెందామరై పంచాయతీ ఏర్పాటుచేయించమంది. చెప్పకుండా చెయ్యకుండా పారిపోయిన పవనాళ్‌ని వేలుపిళ్ళై ఏలుకోవలసిన అవసరంలేదని పంచాయతీ తీర్పుచెప్పింది. విడాకులు సందర్భంలో ఆనవాయితీప్రకారం ఇరవై అయిదురూపాయలు పరిహారం కూడా వేలుపిళ్ళై మొదటిభార్యకి ఇవ్వనక్కర్లేదని చెప్పింది. పవనాళ్ పుట్టింటికి పారిపోయినప్పుడు తీసుకుపోయిన సామానులే విడాకుల పరిహారానికి చెల్లుబెట్టింది.

“సెందామరైముండ చెప్పించిన తీర్పు, కాటికికాళ్లు చాచుక్కూచున్న ముసలాళ్లక్కూడా అది ఆడింది ఆట, పాడింది పాట,” అనుకున్నాడు చెట్టియార్.

“అయినా పవనాళ్ గయ్యాళిముండ. దాని కవ్వలసిందే.”

చెట్టియార్ సెందామరైకి పక్షపాతంచూపించకుండా ఉండలేకపోయాడు. బిగువైన రవికలోనుంచి పొంచిచూసే సెందామరై చనుకట్టూ ఆప్యాయత ఒలకబోసే పెదిమలసొంపూ, మంచి చెడ్డలు ఆలోచించనివ్వని వెచ్చని కౌగిలింతా, మగతనాన్నికలతపెట్టే పొంగుయౌవనం అతనికి జ్ఞాపకంవచ్చాయి. ఈ సమయంలో ఇటువంటి ఆలోచనలు రావడం అతనికి సిగ్గువేసింది.

“అడిగో ఏలుపిల్లై,” అన్నాడు కొళందవేలు దూరంగా కనిపి

స్తున్న వినాయకుడి గుడిమెట్లమీద అనుకునికూచున్న వేలుపిళ్ళైని చూపిస్తూ.

మాసిపోయిన గుడ్డలూ, చింకితలా, దట్టంగాపెరిగిన గడ్డం, చిక్కిపోయిన శరీరం—వేలుపిళ్ళై ఆకారం చెట్టియార్‌ని భయపెట్టింది. సెందామరై పోవడం వేలుపిళ్ళైని ఇంత కదిలించివేస్తుందని అతను ఊహించనైనా లేదు. సెందామరైమీద కోపం వచ్చింది.

"కృతఘ్నురాలు" అనుకున్నాడు.

"పిచ్చెత్తేలాఉంది యీడికి" ఆశీర్వాదం వేలుపిళ్ళైని చూపిస్తూ అన్నాడు.

"పిచ్చే మరి. నిచ్చేపంలాటి పవనాళ్‌ని తగిలేసేడు. ఈముండ కోసం రేత్తిరీ పగలూ ఒకే ఏడుత్తున్నాడు. సోద్దెం," అన్నాడు కొళంద వేలు.

"ఎఱ్ఱిమాలోకం. ఊరంతా గోలెడతన్నా దానియినయం ఈడి కాడికి రానేదు?." అన్నాడు ఎన్నాసిముత్తు.

కొండాయి ఎన్నాసిముత్తుచెయ్యి రహస్యంగానొక్కి, "ముందూ వెనకా చూసుకోనక్కర్లేదూ," అన్నట్టు గోపాలచెట్టియార్ ఉన్నాడని కళ్లతో సంజ్ఞచేశాడు. చెట్టియార్ ఇది కనిపెట్టాడు.

"అయినా అది ఒచ్చినాకనేకాదూ ఏలుపిల్లే ఒక్క ఎలుగు ఎలి గేడు. అణ్ణికూడా బాగా సూస్కునేది," అన్నాడు ఎన్నాసిముత్తు చెట్టి యార్‌కి వినబడేలా.

"నిజంగా పిళ్ళైని దద్దమ్మనిచేసి ఆడించిం దీ ముండ," అనుకు న్నాడు చెట్టియార్.

చుట్టుపక్కల ఆవేశంలో అతను మునిగిపోయాడు.

"ఈ దొంగముండ చచ్చిపోయినందుకు అమాయకుడు ఇల్లూ ఒళ్ళూ గుల్లచేసుకుంటుంటే చూస్తూ ఊరుకోలేను. దానిసంగతి బయట పెట్టేస్తాను," అనుకున్నాడు.

"మీరందరూ ఇంటికి పొండి, పిళ్ళైని నేను తీసుకొస్తాను," అన్నాడు తక్కినవాళ్ళ వైపు తిరిగి.

చెట్టియార్‌నిచూసి భోరున ఏడ్చేడు వేలుపిళ్ళై.

"పెద్దవాడివి నువ్వే ధైర్యంగా ఉండకపోతే ఎలాగ" గుండెల మీద ఒరిగిన వేలుపిళ్ళై ముసలి వెంట్రుకలు నిమురుతూ చెట్టియార్ అన్నాడు.

"అది లేకుండా నేను బతి కేంలాభం?" ఏడ్చాడు వేలుపిళ్ళై.

"ఛా, ధైర్యంగా ఉండాలి," అన్నాడు చెట్టియార్.

"దేవుడు నన్నుకూడా తీసుకుపోతే బాగుణ్ను. ఒక్కణ్నే చేసి పోయాడు.

"ఆడదాన్నిగురించి ఇంత బేలవై పోకూడదు పిళ్ళై" అన్నాడు చెట్టియార్.

"అది అందరిలాటి ఆడదికాదు." ముక్కు చీదుకున్నాడు వేలుపిళ్ళై.

"పిళ్ళై-" అన్నాడు చెట్టియార్.

అతని గొంతుధ్వని మారింది. గంభీరంగా అన్నాడు. వేలు పిళ్ళై ఏడుపుమానేసి ఆశ్చర్యంగా చూశాడు.

"నువ్వు ఉట్టి అమాయకుడివి. సెందామరై గురించి ఇంత బాధ పడవలసిన అవసరంలేదు. దానిగుణం తెలిస్తే-"

"చెట్టీ, నువ్వుకూడా ఇలా మాటాడుతున్నావా?" వేలుపిళ్ళై అడ్డుతగిలాడు. కూలీవెధవలమాటలు నమ్ముతున్నావా?"

"కాదు పిళ్ళై, నిజంగా సెందామరై ——"

"పోయిన నాలుగయిదు రోజుల్నుంచీ ఈ వెధవలంతా నాకు చెప్పొచ్చిందిదే. నీకు కూడా బోధించేరన్నమాట. దొంగ వెధవలు, నీతిలేని వెధవలు." వేలుపిళ్ళై తుపుక్కున ఉమ్మి అన్నాడు.

"అది బతికుండగా ఒక్కవెధవకీ నోరెత్తడానికి గుండెల్లేక పోయాయి. ఇప్పుడు వాగుతున్నారు చూడలేని వెధవలు."

"పిళ్ళై-" ఏదో అనబోయి ఊరుకున్నాడు చెట్టియార్.

"నీకేం నూరిపోసేరో నాకు తెలుసును. సెందామరై నా కళ్ళు కప్పి నలుగురితోటీ పోయేదట; నువ్వు నమ్ముతావా చెట్టీ," దీనంగా అడిగాడు వేలుపిళ్ళై.

"నమ్మను" తన జవాబు తన్నే ఆశ్చర్యపరిచింది.

"దాన్ని ఆడిపోసుకున్నవాళ్ల నోరు పడిపోతుంది," అన్నాడు వేలుపిళ్ళై.

చెట్టియార్ ఆలోచనలోపడి మౌనంగా కూర్చున్నాడు. కొంతసేపు ఊరుకుని వేలుపిళ్ళై అన్నాడు.

"అది నా ఇంట్లో అడుగుపెట్టకనేకాదూ చెట్టీ, నా దశ తిరిగింది. ఇంతకుముందు నే నే సుఖం ఎరుగుదును?"

"నిజమే" అన్నాడు చెట్టియార్.

వేలుపిళ్ళై పవనాశ్‌తో నరకయాతనపడ్డాడు. ప్రయోజకుడయి ఇంత సంపాదిస్తూ నాలుగూ అనుభవించలేకపోయాడు. సెందామరై అతని సంసారాన్ని చక్కదిద్ది ఒకదారికి తెచ్చింది. దుకాణంమీద కూర్చుని వ్యాపారం వృద్ధిచేసింది. అందర్నీ మంచిచేసుకుని అతనికి నలుగురిలో ఒక స్థానం సంపాదించిపెట్టింది. అతని అవసరాలన్నీ తీర్చింది. సెందామరై పోయినందుకు వేలుపిళ్ళై పడుతున్న వేదన చెట్టియార్‌కి ఇప్పుడు అర్థమైంది.

"పోనీ అది అటువంటిదే అనుకో, దాని జోలి వీళ్ళకెందుకూ?" మళ్ళీ అందుకున్నాడు పిళ్ళై, "నాలాటి ముసలాడికి వయసులో వున్నది దొరికిందని వీళ్ళ కడుపుమంట."

నిజంగా వేలుపిళ్ళై పైకికనిపించేటంత అమాయకుడా అన్న అనుమానం కలిగింది చెట్టియార్‌కి. సెందామరై గురించి తను చెప్పదలుచుకున్నది, అతనికి తెలియదా? తెలియజెప్పడానికి అందరికీ ఎందుకు ఇంత ఆరాటం? దానివల్ల వేలుపిళ్ళైకి కలిగే లాభం ఏమిటి? ఇప్పుడు నిజం తెలుసుకోడంవల్ల అతను సెందామరైతో అనుభవించిన శాంతి భోగాలు కాకపోతాయా? పాపం! సెందామరై మాత్రం ఏం చేస్తుంది? యాభై అయిదేళ్ళ ముసలాడితో కాపురంచేసి సుఖపెట్టింది, వేలుపిళ్ళై కృతజ్ఞుడై ఉండాలి. అంతకిమించి సెందామరై గురించి గోపాలచెట్టియార్ ఆలోచించతలుచుకోలేదు.

"పిళ్ళై, ఆకలేస్తూంది, ఇంటికి పోదాం పద," అన్నాడు. వేలుపిళ్ళై లేచి నుంచున్నాడు. ఇద్దరూ బజారువైపు నడక సాగించారు.

—:o:—

# రెండు శవాలు

## రావి కొండలరావు

తొలికోడితో లేచి, తన వంగతోటకు నీళ్ళు పట్టుకుని, అలసి పోయిన శరీరాన్ని నదిలో ముంచాలని, నదివేపు దారితీస్తూ .... దారిలో వున్న పాడుబావిలోకి అనుకోకుండా ఓసారి తొంగిచూసి....వులిక్కిపడి, తలలాక్కుని .... మళ్ళీ కళ్ళు అంతవిచేసుకొని చూసి కెవ్వుమన్నాడు రంగయ్య. రంగయ్యకు ఒంటిమీద స్పృహ తప్పినట్లయింది. తను చూసింది నిజమా కలా అనుకున్నాడు. వూపిరీ, పెదవులూ బిగించి మరోసారి బావిలోకి చూశాడు. ఈసారి అతను పూర్తిగా, తెలివిగా చూశాడు—బావినీళ్ళలో తేల్తూ రెండు శవాలు కనిపించినై!........

రంగయ్యకు వొళ్ళు మరింత చెమటపట్టింది. ఏమిటో మాట్లాడ బోయినాడు—గట్టిగా అరవబోయినాడు. పెదవులు తెరుచుకున్నై గాని, కంఠంలోంచి స్వరం బయటకు రాలేదు. రంగయ్య కొయ్యబారిపోయి నాడు—తమాయించుకొని, వెనక్కువచ్చి అటూ ఇటూ చూశాడు. కను చూపుమేరలో ఎవరూ కనిపించలేదు. కొన్ని ఫర్లాంగుల దూరంలో తన వూరు మాత్రం కనిపిస్తున్నది. రంగయ్య ఏమీ తోచనివాడల్లే, తనను ఎవరో తరుముతున్నట్లుగా ఊరికేసి పరుగెత్తసాగాడు—రొప్పుకుంటూ!

"కసరత్తు మొదలెట్టావా ఏవిఁటి రంగయ్యా?" అని ప్రక్కనుంచి నవ్వుతూ పలకరించాడు—కరణంగారి అబ్బాయి వేణు. ఈ పిలుపుతో రంగయ్య తన కాళ్ళకు బంధాలుపడ్డట్టు ఠక్కున ఆగాడు.

"గోరం చినబాబూ—గోరం" అన్నాడు రంగయ్య బావికేసి చూస్తూ.

వేణు ఏవిఁటని ప్రశ్నించేలోగానే రంగయ్య చెప్పసాగాడు—

"పెందలకడలేచి ఎవళ్ళమొహం చూశానోగాని–రామరామ.... నూతికాడికెళ్ళి లోపలికి తొంగిసూద్దును–రెండు సెవాలు బాబూ రెండు–" అన్నాడు తడబడుతూ.

వేణు అగమ్యంలోపడ్డాడు. "ఏమిటి రంగయ్యా—శవాలా? బావి లోనా?" అంటూ పరుగెత్తసాగాడు. వెనకాలే రంగయ్య పరుగెత్తాడు. ఇద్దరూ బావిగట్టుమీదనుంచి లోపలికి తొంగిచూశారు—నిశ్చలంగా రెండు శవాలు—ఒకటి మగ, ఒకటి ఆడ ఒకదాన్నొకటి ఒరుసుకుంటూ పాడు నీళ్ళలో తేలివున్నై!

ఒక్క గంటసేపట్లో, వూరు వూరంతా ఆ వార్త పాకిపోయింది. "వూరవతలవున్న పాడుబావిలో రెండుశవాలు" అన్న వార్తే గాని—రెండో మాట వూళ్ళో వినిపించలేదు. సగంవూరంతా బావిప్రాంతాలకు వచ్చింది. ఆడవాళ్ళూ, మగాళ్ళూ, ముసలాళ్ళూ అంతా చేరి, ఓసారి బావిలోకి తొంగిచూచి "రామ రామ" అనో, 'నారాయణ' అనో అనుకుంటున్నారు.

"ఏమిచోద్యమమ్మా" అన్నది వెంకమ్మ చుక్కమ్మతో.

"పోయేకాలం కాకపోతేనూ—హయ్యో!" అని నోరునొక్కుకున్నది చుక్కమ్మ.

"కలియుగం," అన్నాడు నరసింహులు నారాయణతో.

"ఎవడికి పుట్టినబుద్ధి చెప్మా యిది?" అన్నాడు నారాయణ.

"భార్యాభర్తలిద్దరికీ గొంతులునొక్కేసి నూతిలో పారేశాడు. వీడి చేతులుపడిపోనూ—వీడికి చేతులు ఎట్లావచ్చాయో!" అనుకున్నది సుబ్బమ్మ.

"హత్యలా! ఆత్మహత్యలా!" అనుకున్నాడు వెంకటేశ్వర్లు. డిటెక్టివ్ సాహిత్యం తనపై ప్రసరించిన జ్ఞానకిరణాలవల్ల.

"ఇదేదో భగ్నప్రేమ," అని వాపోయాడు ప్రణయకథల పాఠకుడు సుబ్బారావు.

పాడుబావిలో రెండుశవాల వార్త, పక్కవూళ్ళకు కూడా పాకింది. ఇసకవేస్తే రాలనంతగా జనం పోగయినారు. అంతటా హడావిడి, కోలాహలం, పెద్దగా గోల—కేకలు!!

ఊళ్ళోవున్న అంతమంది చేరారుగాని—ఆ శవాల ముఖాలు సరిగా తెలియకపోవటంవల్ల ఎవరూ గుర్తుపట్టలేదు. 'ఎవరు చెప్మా, ఎవరు చెప్మా!' అనుకున్నారు. ఎవరూ ఏడుస్తూ రాలేదు కాబట్టి, ఈ వూరువాళ్లు కాదేమోనని ఎవరో అన్నారు. 'దిక్కులేనివాళ్ళేమో అని ఒకడన్నాడు. ,ఆకలిచావులు' అని మరొకడన్నాడు.

మునసబూ, కరణమూ, పోలీసువాళ్లూ వచ్చారు. జనాన్నిదూరంగా తరిమి, అదుపులోపెట్టారు. రెండుశవాల్నీ పైకితీయించారు. ఒకటి మగ వాడు. కుర్రాడే. పాతిక సంవత్సరాలుంటాయి. పాంటు, చొక్కా వున్నై. రెండోది ఆడశవం. చీరె, రవికా, చేతికి ఒకటి రెండు గాజులూ వున్నై. వయస్సు ఇరవై సంవత్సరాలుకూడా వుండవేమో........

కరణంగారి అబ్బాయి వెంటనే ఆ మగశవాన్ని గుర్తుపట్టాడు– అది ఆనందరావు అనే యువకుడిది. ఆనందరావును కరణంగారి అబ్బాయి వేణు ఎరుగును. ఇంకొకాయన ఎవరో—ఆ అమ్మాయిని గుర్తుపట్టాడు. తనయింటిప్రక్కనున్న నాగభూషణంభార్య లక్ష్మి........ కొద్దిసేపట్లో ఈ రెండుశవాలూ ఎవరివో వూరంతా తెలిసిపోయింది.

పోలీసువాళ్లు ఈ శవాల్ని పంచాయితీకి పంపారు. శవాల శరీరాలపై కత్తిపోట్లుగాని, మరేవిధమైన దెబ్బలగుర్తులుగాని లేవు. గొంతు పిసికి నూతిలో పారేసినట్టుగాకూడా అనుమానించటానికి లేదు. క్రితం రాత్రి పన్నెండు, ఒంటిగంటలమధ్య ఈ మరణాలు జరిగి వుంటాయని, ఆత్మహత్యలు కావచ్చుననీ నిర్ధారణచేశారు పంచాయితీవారు. ఆనంద రావు జేబులో వెతికితే ఒక అధమరకం సిగరెట్టు పెట్టె, ఒక అగ్గిపెట్టె కొన్ని చిల్లరడబ్బులు దొరికాయి. చీరా, రవికా, గాజులూ, తలలో రెండుపువ్వులూ మినహా మరేం దొరకలేదు లక్ష్మిదగ్గిర.

ఈ శవాలను వాళ్ళ బంధువులకు వప్పగించాలని పోలీసువాళ్ళు చూశారు. ఏడ్చుకుంటూ ఎవరన్నా వస్తారేమోనని చాలాసేపు నిరీక్షించారు. ఎంతకూ ఎవరూ రాలేదు. ఈ ఆనందరావు విషయమై సబ్ఇన్‌స్పెక్టరు వేణూను చాలా ప్రశ్నలువేశారు.

"ఆనందరావుకు నాకూ పెద్ద స్నేహం ఏమీలేదు. కాని, బాగా తెలుసు. సాధారణంగా పఠనమందిరంలో కలుసుకునేవాళ్ళం. అతను ఒక్కడే ఇక్కడుంటున్నాడు, ఏదో ఆఫీసులో వుద్యోగం చేసుకుంటూ. అతని బసకు నేనెప్పుడూ వెళ్ళలేదుగాని– పెద్దరోడ్డుకు అడ్డంగావుండే రంగనాథంవీధిలో ఒక చిన్నగదిలో వుంటున్నట్టుగా నాతో చెప్పాడు. హోటల్లో భోజనం. వయస్సు పాతికసంవత్సరాలుంటాయి. మనిషి చాలా మంచివాడూ, నవీనభావాలు కలవాడూనూ. సిగరెట్లు జోరుగాకాల్చేవాడు.

ఎంతసేపూ పుస్తకాలు చదువుకొనేవాడు. ఎంతపిల్చినా పేకాటకుగాని, క్యారమ్సుఆటకుగాని, మరోఆటకుగాని వచ్చేవాడుకాదు. తనకుపెళ్ళికాలేదనీ, తండ్రిలేడనీ, తల్లివున్నదనీ, ఆమె ఏక్కడో తన అన్నయ్యదగ్గిర వుంటున్నదనీ చెప్పేవాడు. ఇంతకంటే నాకేంతెలీదు." అన్నాడు వేణు.

"ఆనందరావు ఎప్పుడూ మీదగ్గిర ఈ అమ్మాయివిషయమై ప్రస్తావించలేదా?" అనడిగాడు ఇన్‌స్పెక్టరు.

"లేదు."

"తనను పెళ్ళిచేసుకోమని వాళ్లమ్మ ఉత్తరాలు రాస్తే, వాటి మీద ఇతని భావాలు ఎట్లా వుండేవో మీకేమయినా తెలుసా?"

"నేనుకూడా పెళ్ళిసంగతిఅడిగేవాడిని. నవ్వి వూరుకునేవాడు."

"పెళ్ళిచేసుకోవాలనిగాని, వొద్దనిగాని ఏమీ అనలేదన్నమాట."

"ఏమీలేదు."

"ఈ అమ్మాయి ఎవరో మీకు తెలుసా?"

"నాకు తెలీదు. నే నెప్పుడూ చూడలేదు. ఇప్పుడు వినటంవల్ల వీళ్ళది ఫలానావీథి అని అనుకుంటున్నాను. ఆ వీథిలో ఒక్కొక్కప్పుడు ఆనందరావు నాకు కనిపించేవాడు" అన్నాడు వేణు.

"ఆహాఁ!" అన్నాడు, ఇన్‌స్పెక్టరు. అని "ఈ బావిలో శవాలను మొదట చూసింది మీరేకదూ?" అన్నాడు.

"కాదు. ముందు రంగయ్య చూశాడు. నాతో చెబితే నేనూ చూశాను."

ఇన్‌స్పెక్టరు రంగయ్యను కొన్నిప్రశ్నలడిగాడు. ఉదయం తను ఈ శవాల్ని ఎట్లా చూడటం తటస్థించినదీ, వేణుకు ఎట్లా చూపించినదీ వున్నదివున్నట్టుగా చెప్పాడు—రంగయ్య.

పోలీసులు ఆనందరావుగదిని వెతికారు. ఆత్మహత్యచేసుకోబోతున్నట్టు ఎక్కడా ఏ ఉత్తరమూ రాసిపెట్టబడలేదు. చిన్న గది. గదిలో ఓ చాపా, చిన్న పెట్టే, కొన్ని పుస్తకాలూ, కాయితాలూ మినహా చెప్పుకునేందుకు మరేం వస్తువులు లేవు. ఉత్తరా లేవో దొరికాయి

గాని—ఈ లక్ష్మి రాసిన వుత్తరా లేవీ దొరకలేదు. మామూలు విషయాలతో స్నేహితులు రాసినవీ, పెళ్ళివిషయమై తల్లి రాసినవీ ఆ ఉత్తరాలు.

ఈ విషయం అతని తల్లికి తెలియజెయ్యాలని పోలీసువాళ్ళు ఆమె చిరునామాకోసం ప్రయత్నించారు లభ్యంకాలేదు. కార్డుపై వూరు పేరు మాత్రం రాసివున్నది. ఆనందరావుఆఫీసులో పనిచేస్తున్న అతని తోడి గుమాస్తాలనుకూడా వాళ్ళు తల్లిచిరునామాగురించీ, ఇతర విషయాలగురించీ, అడిగారు. తల్లి చిరునామా తెలియదన్నారు—ఇతర విషయాలు వేణు చెప్పినట్టే చెప్పారు. తన కో ప్రియురాలున్నట్టుగా ఆనందరావు చెబుతూవుండేవాడనీ, ఐతే ఆమె ఎవరయినది తను చెప్పేవాడుకాదనీ ఒక మిత్రుడన్నాడు.

లక్ష్మివిషయమై ఆరాతియ్యగా ఆమెభర్త నాగభూషణం నాలుగురోజులుగా వూళ్ళోలేడని తేలింది. లక్ష్మి పొరుగింటి సూర్యనారాయణా, అతని భార్యా ఈ విషయం చెప్పారు.

"నాగభూషణం మా యింటిప్రక్కనే వున్నా అతనితో నా కంత స్నేహంలేదు. అసలు నేనే స్నేహితంగా మెలగనులెండి—అతని దంతా అదో పద్ధతి—" అన్నాడు సూర్యనారాయణ సాగదీస్తూ.

"ఏమి టా పద్ధతి?" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"అంటే ఏముందీ—మనిషిదగ్గిర కలుపుగోలుతనం, మంచితనం ఏమీ లేదు. ఎప్పుడో ఇంటికి వస్తాడు—భార్యపై ఏదో కేకలు వేస్తాడు—తిడతాడు...."

"అతని వుద్యోగం?"

"ఉద్యోగం ప్రస్తుతం ఏమీ లేదు. నెలరోజులనుంచీ ఖాళీగానే వుంటున్నట్టున్నాడు. వేళకు వెళ్ళటం రావటం ఏమీ లేదు. అంతకు పూర్వం ఏదో మిల్లులో గుమాస్తాగా వుండేవాడు."

"లక్ష్మి ఎట్లాంటి మనిషి?" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"లక్ష్మి మంచిపిల్లే. నాతో చనువుగా మాటాడుతూ వుండేది. 'పిన్నిగారూ' అంటూ పిల్లలాగా తిరిగేది. ఎంతసేపూ ఇంటిపని చూసుకునేసరికే ఐపోయేది. పాపం! వాళ్ళ ఆయనంటే దానికి ఇంతా అంతా భయంకాదు?" అన్నది సూర్యనారాయణభార్య.

"నాగభూషణం ఎక్కడికి వెళ్ళాడో ,తెలీదా?" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"తెలీదండీ. నాలుగురోజులయింది. వూళ్ళోనే లేడు. ఎక్కడికో పనిమీద పొరుగూరు వెళ్ళాడని మాత్రం లక్ష్మి చెప్పింది. ఏవూరు అని నే నడగలేదు సుమా—నా కెందు కా గొడవలు?" అన్నది సూర్యనారాయణ భార్య.

"సరే, నాగభూషణం వూరువెళ్ళి తిరిగి రాలేదన్నమాట కదూ?"

"నాకు తెలిసినంతవరకూ రాలేదనే అనుకోవాలి," అన్నాడు సూర్యనారాయణ.

లక్ష్మిఇల్లంతా వెతికారు. ఒక చిన్నగదీ, వంటయిల్లూనూ. వంటయింట్లో కాస్త పాత పాత్రసామగ్రీ, గదిలో రెండు చింకి చాపలూ, రెండు చీరెలూ, ఏవోగుడ్డలూ, పాత పత్రికలూ తప్ప ఇంకేంలేవు. పాత వుత్తరాలేవో దొరికాయిగాని—ఆనందరావు లక్ష్మికి రాసినవి ఏవీ దొరకలేదు.

పోలీసువాళ్ళు నాగభూషణానికి అతనిభార్య మరణంవిషయం తెలియజెయ్యాలని పొరుగూళ్ళు చూశారు.—జాడేలేదు.

ఊళ్ళో ఎక్కడచూసినా బావిలో తేలిన రెండుశవాల విషయమే చర్చ. కరణంగారి చావిడిలో, మునసబుగారి వాకిట్లో, పార్కులో, హోటళ్లలో, వూరు వూరంతటా ఇదేవిషయం.

"ఆనందరావు లక్ష్మిని గాఢంగా ప్రేమించాడు. అందుకు సందేహంలేదు. లక్ష్మికి పెళ్ళికాకపూర్వమే ఆనందరావు ఆమెను ఎరుగునట— తెలుసా?".

"అవునూ—నాకు తెలీదా యేవిఁటి? వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకోవాలని చాలా ప్రయత్నించారు. పరిస్థితులు అనుకూలించలేదు. లక్ష్మితండ్రికి ఆనందరావుమీద ఇష్టంలేదు. ఆ కారణంచేత ఆమెను నాగభూషణానికి ఇచ్చారు. ఈ వూళ్ళో నాగభూషణానికి వుద్యోగం—లక్ష్మి ఇక్కడికి వచ్చింది. ఆమెతోపాటే ఆనందరావూ మకాం మార్చేశాడు—"

"చాలా రోజులవరకూ నాగభూషణం ఈ విషయం ఎరగడు. ఈ మధ్యనే తెలుసుకుని, లక్ష్మిని నానా తిట్లూ తిట్టి, చావబాదాడు. ఆనంద

రావును హతమార్చాలనుకున్నాడు—"

ఈ సంగతి తెలుసుకుని, ఇద్దరూ ఆత్మహత్యచేసుకోవాలని నిర్ణయించుకున్నారన్నమాట........ 'ప్రేమ' ఎంతపనయినా చేయిస్తుంది...."

"దీనిమొహంఈడ్చా — దీనికేం పోయేకాలం........కట్టుకున్న మొగుడంటూ వుంటూవుంటే వాడిని కాదని పెధవవేషాలు...."

"కలియుగం ఒదినగారూ-వింటున్నాంకామూ ఇలాంటి విషయాలు? ఇందులో ఆశ్చర్యం ఏముంది?" అన్నది ఒకామె.

"అసలు ఇద్దరూ ఆరాత్రి నూతిదగ్గర కలుసుకుందా మనుకున్నారట—ఎవరో వస్తున్న అలికిడికాగా, నూతిలోకి దూకేశారుట," అన్నది రెండోఆమె.

మరొకామె నవ్వింది-"అంతపిచ్చివాళ్ళేం కాదులెండి. తెగించిన పెధవలకి మనిషిఅలికిడి లక్ష్యమూ ఏమిటీ-ఏమో-చచ్చారు. పీడాపోయింది. ఇలాంటి పాపాత్ములు బ్రతికితే భూమాతకూ, మనకూ బరువే!" అన్నది.

కాని-లక్ష్మి ఎన్ని వేషాలు........ఎన్ని వేషాలు........నాకు మొదట్నుంచీ అనుమానమే దీనిరకం, వ్యవహారంచూస్తే ఇదేం సంసారప్పిల్లలాగా నాకేం కనిపించలేదు!"

"లక్ష్మిని మీరు ఎరుగుదురా ఏమిటి?"

"ఎరక్కేం- నీళ్ళకోసం వెళ్ళినపుడల్లా అక్కడప్రత్యక్షం........ అబ్బ.......ఆ సింగారం! ఆ నడకా........"

"పోనీలెద్దురూ-ఎవరివెర్రి వాళ్ళకానందం. దా నిష్టం-మన కెందుకు?" అన్నది కొత్తగా పెళ్ళయిన ఒక అమ్మాయి, లేచివెళ్తూ.

"దీనిబతుక్కి ఇది చెప్పటమే..." అన్నదిఒకామె.

"ఎవ రీ పిల్ల?"

"మన రాజరత్నం కోడలులే. ఆఁ- కోడలూ నా మొహమూనూ! ఆ కొడుక్కి ఎక్కడో ఉత్తరాదిన వుద్యోగం - ఈ పెళ్ళాంగారు ఇక్కడ నానా వేషాలు వేస్తు...." అని గొంతుతగ్గించి - "వాళ్ళింట్లో అద్దెకున్నాడులే ఓ కుర్రాడు- వాడిని పెట్టుకుని...." అన్నది.

"రామ రామ....ప్రపంచంఅంతా ఒఖలా వుంది.....మార్కెట్లు మండిపోతున్నాయంటే మండవూ మరి?"

లక్ష్మిఇంటిప్రక్కనవుండే సూర్యనారాయణ నాగభూషణాన్ని తిట్టసాగాడు. నాగభూషణంప్రవర్తనవల్లే లక్ష్మి ఇట్లాతయారయిందన్నాడు.—

"వీడు పెందరాళే కొంపకుజేరుతూ, వేళపట్టున ఇంటినవుంటూ పెళ్ళాన్ని అదుపులోపెట్టఖర్లా?—అందుకే వీడినిచూస్తే దానికి మంట. ఏవో డబ్బులుతెచ్చేవాడు—తాగేసి. అర్ధరాత్రి కొంపకుజేరేవాడు..."

"మీబుద్ధికి మీరూఅనడమే—వూరుకుందురూ—మీరుమాత్రం పెందరాళే కొంపకుజేరుతున్నారా — తిండి తింటున్నారా—మీ కదిగో—ఆ ముండ వున్నంతకాలం..." అన్నది అతనిభార్య.

"దానిసంగతే నిన్ను ఎత్తొద్దన్నాను. చచ్చినట్టుపడివుండు — లేకపోతే పో," అని లేచాడు సూర్యనారాయణ.

"పడేవున్నాను. అంత బంగారమూమీకింద తగలబెట్టి—ఇదిగో నెత్తీనోరూ మూసుకొని ఇలా నిలబడ్డాను—" అన్నది గుడ్డలోంచి నీరు గ్రక్కుతూ సూర్యనారాయణభార్య.

"నోర్ముయ్—ఏడుస్తావేం? నువ్వూ ఆ నూతిలో పడి చావు—ఆ లక్ష్మితోపాటు."

"అలాగే చస్తాను... పాపం...దాని చావుతల్చుకుంటే నా గుండె బద్దలయిపోతుంది. చక్కదనాలపిల్ల...ఒకరిజోలీ, బాధా అక్కర్లేని పిల్ల... ఇంతపనికి ఎట్లాతెగించిందో. అమాయకురాలు... ఆ వెధవ ఎవడో ఏం మందుపెట్టాడోగాని—"

"ఇదేం తక్కువదా ఏమిటే? నువ్వు దాన్ని సమర్థిస్తావెందుకు? ఇది నన్నే వల్లోవేసుకుందామని చూసిందిగా!" అన్నాడు సూర్యనారాయణ గొప్పవాడల్లే.

లక్ష్మి ఆనందరావుల చావులగురించి ఇట్లా రకరకాలుగా చెప్పుకోసాగారు. ఆత్మహత్యలని కొందరూ, పోలీసువాళ్ళు కాదంటున్నా 'హత్యలే' అని కొందరూ మాట్లాడసాగారు. ఆనందరావుగురించీ, లక్ష్మిగురించీ పోలీసువాళ్ళు వీలయినన్ని వివరాలు సేకరించారు. సేకరించిన వివరాలనుబట్టి వీళ్ళిద్దరూ గాఢప్రేమికులేనని తేల్తున్నది. నాగభూషణానికి తెలిస్తే రభసలవుతుందనీ, లోకం ఆడిపోస్తుందని ఇట్లా బలవంతపు

చావులు చచ్చారనీ పోలీసులభావన.

బావిలో శవాలుదొరికిన ఆ సాయంత్రంవరకూ పోలీసులు ఆ కళేబరాలను అట్లాగేవుంచారు. వాటిబంధువులకోసం ప్రయత్నించి ఎవరూ అప్పట్లో వచ్చేసూచనలు కన్పించకపోగా వాటిని దహనపర్చారు.

ఆ సాయంత్రం పోలీసుస్టేషనుకు ఒకసాక్ష్యం వచ్చింది. వూరు చివర వుంటున్న ఒకాయన, లక్ష్మి ఆనందరావూ కలిసి క్రితంరాత్రి అటు వెళ్ళటం చూశా నన్నాడు. "అదేరంగు గుడ్డలు—వాళ్ళేలెండి. ముఖాలు నేను చూడలేదుగాని—సర్దాగా కబుర్లుచెప్పుకుంటూ పోతున్నారు."

అతన్ని పోలీసులు మరేవో ప్రశ్నలువేశారు. అతను సమాధానాలు ఇచ్చాడు.

"ఆత్మహత్య చేసుకుందామని అనుకునేవాళ్లు అంత సరదాగా వెళ్తారా?" అనుకున్నాడు ఇన్స్పెక్టరు. ఈ సరదాగా వెళ్ళటాన్నిబట్టి చూస్తే ఆత్మహత్యచేసుకుందామనే వుద్దేశం వీళ్ళకు లేనట్టుంది. ఏమయినా వీళ్ళచావులగురించి రకరకాల ఫోగట్టాలు వినవస్తున్నై. ఇందులో ఏది నమ్మాలో ఏది నమ్మకూడదో ఏమీ తెలీటంలేదు. ఆఖరికి పోలీసువాళ్ళు ఒకటి కావచ్చుననుకున్నారు. ఏమిటంటే — నాలుగు రోజులుగా నాగభూషణం వూళ్లోలేడు. వెళ్లేముందు భార్యతో పోట్లాడి వెళ్లాట్ట. ఆ తర్వాత రానేలేదు. లక్ష్మి ఆనందరావూ సాధారణంగా వూరవతల బావిగట్టుమీద కలుసుకుంటూవుండేవారుకాబోలు - అందుకని నాగభూషణం తను వూళ్లోలేనట్టునటించి, వూళ్లోనే ఎక్కడో వుంటూ, రాత్రి వూరవతల వీళ్ళకోసం ఎదురుచూస్తూ, ఆరాత్రి అక్కడికి వచ్చి వాళ్లు గట్టుమీదకూచునివుండగా నాగభూషణం వెళ్ళి, ఇద్దర్నీ బావిలోకి తోసేసి, తనమానాన తాను పారిపోయివుంటాడు. ఆ తొయ్యటంలో వాళ్ల కేకలువేసినా, వూళ్లోవాళ్ళకు వినిపించటానికి—దూరం కాబట్టి ఆస్కారంలేదు - ఇదే కావచ్చునని చాలామంది అభిప్రాయపడ్డారు. ఏమయినా ఈ నాగభూషణాన్ని వెతికితెస్తేనేగాని, విషయం తేలదు. అందుకని పోలీసువాళ్లు నాగభూషణంకోసం ఆ రాత్రినుంచే తీవ్రంగా గాలించటం ప్రారంభించారు.

* * * *

భూలోకంవిడిచి ఏలోకానికో పోతూ రెండు "ఆత్మలు" గగన మార్గంలో దగ్గరగా కలుసుకున్నై. చాలా దూరంనుంచీ ఆ రెండూ దూర దూరంగా కలిసేవస్తున్నై. ఒకరోజంతా అట్లా ప్రయాణంచేసిన తర్వాత ఒక 'ఆత్మ' తెగించి మరోఆత్మను ప్రశ్నించింది.

"ఎవ్వరు నువ్వు?"

రెండోఆత్మ సమాధానంచెప్పలేదు. ఎందుకో విచారంగావున్నది.

"ఇదిగో-నిన్నే-నువ్వు ఎవరో చెబుదూ కాస్త." అన్నది మొదటి ఆత్మ మళ్ళీ.

రెండోఆత్మ నెమ్మదిగా అటుతిరిగి - "అంత తెలుసుకోవాల్సిన అవసరం ఏముంది?" అన్నది.

"కాదు వూరికే కాస్సేపు మాటాడుదూ-మనస్సేం బాగాలేదూ."

"నే నేమీ మాట్లాడేస్థితిలో లేను. నా మనస్సు అంతకన్న చిరాగ్గా వున్నది."

"అందుకనే ఇద్దరమూ కాస్సేపు మాట్లాడుకుందాం- ఆ చిరాకులు మరచిపోతాం."

"ఐతేవిను. నా పేరు లక్ష్మి - మాది ఫలానా వూరు." అన్నది ఆ ఆత్మ.

"ఏమిటి - నీ పేరు లక్ష్మి! ఆ ఫలానావూళ్ళో బావిలోపడి చచ్చిన లక్ష్మివి, నువ్వేనా?"

"అవును నేనే. నువ్వు ఎవరు - అంత ఆశ్చర్యపడుతున్నావు?"

"నా పేరు ఆనందరావు - నువ్వు చెప్పిన వూరే నాదీనూ."

"ఆఁ ఆనందరావ్! నువ్వేనా ఆనందరావ్వి?" అన్నది ఇంకా ఆశ్చర్యంగా లక్ష్మి.

ఆనందరావుఆత్మ అవునన్నట్లు అల్లల్లాడింది.

రెండు ఆత్మలూ దగ్గరకువచ్చినై.

ఆనందరావుఆత్మ నవ్వింది-నీరసంగా.

"ఏం?" అన్నది లక్ష్మిఆత్మ.

"కాదు-మనవూళ్ళో మనలనుగురించి చెప్పుకుంటున్న కబుర్లు నువ్వు విన్నావా?"

"వింటూనేవున్నాను. అందుకే మనస్సు చిరాగ్గా వుందన్నాను."

"ఏం లోకం! ఏం మనుషులు!!" అన్నాడు ఆనందరావు.

"తెలిసివున్నట్లు ఎన్నెన్ని భోగట్టాలు — ఎం తెంత మాటలు" అన్నది లక్ష్మి.

"సరేకాని, నిన్ను నే నెప్పుడూ చూడనేలేదే!"

"అదే ఆశ్చర్యం. నేనుకూడా నిన్నెప్పుడూ చూడనేలేదు. ఐనా మనం ఇద్దరంకలిసి ఆత్మహత్య చేసుకున్నామటగా!" అని ఫక్కున నవ్వింది లక్ష్మి.

ఆనందరావూ నవ్వాడు—"నువ్వు నాకు రాసిన వుత్తరాలకోస మట— నా గదంతా చిందరవందరచేశారు. ఒక్కసారి క్రిందికి దిగి వెళ్ళి 'నాగది ఇట్లా చెయ్యడానికి మీ కేం అధికారంవుందని అడగాలని పించింది' అన్నాడు.

"ఈ మనుషులకి మరేం పనిలేదనుకుంటా. వున్నదీ, లేనిదీ కల్పించి మాట్లాడుకోటంలో వాళ్ళ కెంత ఆనందం!"

"అదే— ఒక మగాడూ ఆడదీ ఒకబావిలో చచ్చారనగానే— ఎన్ని కథలు అల్లారు—ఎన్ని అబద్ధాలుఆడారు—అసలు లోకమే అంత. ఉదాహరణకు చెబుతా విను. నే నొకరాత్రి ఏదో ఆలోచించు కుంటూ పార్కులోకివెళ్ళాను. అక్కడ ఎవరో మాట్లాడుకుంటున్నారు. నాకు ప్రశాంతతకావలసివచ్చింది. అందుకని ప్రక్కనేవున్న స్త్రీల పార్కులోకి వెళ్ళాను. సాయంత్రమే అది ఖాళీఐపోతుందిగా మరి! నా రాకచూసి ఆ తోటమాలివాడు ఎగిరాడు—"ఆడవాళ్ళపార్కులో ఈ రాత్రివేళ నీ కేం పని?" అన్నాడు. 'ఎవత్తెను రమ్మనిచెప్పావ్?' అని అడిగాడు. నాకు ఒళ్ళుమండిపోయింది—చెప్పుతో ఒక్కటి ఇచ్చు కుందామన్నంత కోపంవచ్చింది. 'ఈ పార్కులోకి వస్తేమాత్రం సదు ద్దేశంతో వచ్చారని ఎందుకు అనుకోవు?' అని అడిగాను, 'వీల్లేదు' అన్నాడువాడు. సదుద్దేశమే పనికిరాదంటాడు.—అర్ధరాత్రివేళ స్త్రీల పార్కులోకి వెళ్ళటం అంటే అందులో సదుద్దేశం ఎక్కడ వుందంటాడు. లేనిపోని మాటలెన్నోఅన్నాడు. నా మీద ఎన్నికథలో కల్పించటానికి సిద్ధపడ్డాడు, నేను వెనక్కుతిరిగిచూడకుండా బయటపడ్డాను. అటు

వంటిది— ఒక బావిలో ఒక ఆడశవం, మగశవం కనిపిస్తే కథలురావూ! అన్నట్టు వాడెవడోఅంటాడు—మనిద్దరం నవ్వుతూ వెళ్తూవుంటే చూశాట్ట! ఇట్లా నిందగా మాట్లాడటంలో గొప్పతనం వుందనుకుంటారు కాబోలు! అసలు ఆ వేణుగాడు నాతో అంతస్నేహితంగా మెలిగి, అంటాడూ— నన్ను వాడు చాలాసార్లు మీ వీధిలో చూశాట్ట—వెధవని పాతిపెట్టాలి!" అన్నాడు ఆనందరావు.

"నామీద చూశావా— మా పొరుగింటి సూర్యనారాయణ ఏమ న్నాడో— అతన్ని నేను తండ్రిలాగా భావించుకునేదాన్ని — వాడిని నేను వల్లో వేసుకుందామని చూశానుట—వాడిభార్యమాత్రం మంచిదే. వాడుమాత్రం దొంగముండాకొడుకు! నేను పోకిరీదాన్నట —వేషాలు వేస్తానుట— నంగనాచినట—అబ్బబ్బ . . . ఈ ఆడంగులకు మరేం పనిలేదు — ఛీ ఛీ . . ." అన్నది లక్ష్మి.

"మనిద్దరం నీ పెళ్ళికాక పూర్వంనుంచీ ప్రేమికులమటగా!" అని నవ్వాడు ఆనందరావు.

"వాళ్ళ శార్ధం," అని లక్ష్మికూడా నవ్వింది. వాళ్ళగురించి వూళ్లో చెప్పుకున్న కబుర్లూ, కథలూ తిరిగి చెప్పుకున్నారు — నవ్వు కున్నారు — కోప్పడ్డారు - తిట్టారు — ఈ లోకాన్నీ ఈ మనుషుల్నీ నమిలి మింగేద్దాం అనుకున్నారు!

"ఇంతకూ అసలు నువ్వు ఎట్లా చచ్చిపోయావు? ఎందుకు చచ్చి పోయావు?" అన్నాడు ఆనందరావు.

"మా ఆయన నాగభూషణం అని విన్నావుగా. మేము చాలా బీద వాళ్ళం. ఆయన ఆట్టే చదువుకోలేదులే. ఏదో చిన్న వుద్యోగంచేస్తూ వుండేవారు. ఆ వచ్చినడబ్బులు మా తిండికే చాలేవికావు. నాకు పెళ్ళయి ఎన్నాళ్లో కాలేదు. తర్వాత కొన్నాళ్ళకు మా ఆయన్ను వాళ్ళాయన పని లోంచి తీసేశాడు. మాకు తినటానికి మెతుకులు లేకపోయినై .ఇంట్లోవున్న గిన్నె, చెంబూ అన్నీ అమ్ముకుతిన్నాం. ఆయన ఎంత తిరిగినా ఎవడూ వుద్యోగంఇవ్వలేదు. ఒక్కరోజు ఏదో కూలిపనిచేసి, కొన్నిఅణాలు తెచ్చిఇచ్చేవారు. ఇట్లా చాలా బాధలుపడ్డాం. దరిద్రంఅంతా మా కొంప లోనే వున్నట్టు కనిపించింది. ఆఖరుకు మా ఆయన నాలుగురోజులుగా

తిండి తిప్పల్లేక ఇంటికి వచ్చి-"నేను ఎక్కడికో పోతున్నాను. నాగురించి నువు బెంగపడమాకు. బ్రతికివుంటే, సుఖంగావుంటే తిరిగివస్తాను. ఎక్కడికి వెళ్తానో నాకేం తెలీదు,"—అన్నారు. నేను ఏడ్చాను. వెళ్ళొద్దని బ్రతిమాలాను. ఆయన వినిపించుకోలేదు. మాట్లాడకుండా, గుడ్డముక్కయినా పైనవేసుకోకుండా, చరచరా వెళ్ళిపోయినారు. ఆయన వెళ్ళిపోయినతర్వాత నాకు మరేం తోచలేదు. ఒక్కతెనూ ఆ గదిలో కూచుని ఏడ్చాను. మొత్తుకున్నాను. ఆకలిబాధకు , తాళలేకపోయాను. ఇంట్లో అమ్ముకుందామన్నా ఏమీ లేదు. పైగా అప్పులవాళ్ళు ప్రాణాలు తీసేస్తున్నారు. మా ఆయన ఏమైపోయారో నాకు తెలీదు. ఈ దారిద్ర్యంతో ఆయన బ్రతికిఉంటారని నమ్మకంఏమిటి! ఏవేవో ఊహించాను. ఆయనకూడా లేకుండా తిండిలేక బాధపడుతూ శవమల్లే ఎందుకు—ఎవరికోసం ఈ బ్రతుకని అనిపించింది. నిన్నరాత్రి పిచ్చెత్తినట్లయిపోయాను. బాగా పొద్దుపోయాక, అర్ధరాత్రివేళ ఇంటితలుపు దగ్గరగా జేరవేసి వూరవతల పాడుపడిన బావిదగ్గరకు వెళ్లాను. చావాలని నిశ్చయించుకున్నాను. మా ఆయన తిరిగివస్తే — ఒకసారి ఏడుస్తారు. అంతేగా! ఏమయినా బ్రతకటానికి నాకిక ధైర్యంలేకపోయింది. ఆయన్ను సుఖంగా వుంచమని దేవుడిని ప్రార్థించి, ఆ బావిలోకి దూకి ఆత్మహత్య చేసుకున్నాను. ఇదీ నా చావుకథ. ఇటువంటి పరిస్థితుల్లో నేను దిక్కుమాలిచావు చస్తే-ఏ ఒక్కడూ జాలిపడేవాడు లేడుకదా – నామీద ఎన్ని నిందలు మోపుతున్నారో ఎన్ని కట్టుకథలు అల్లుతున్నారో చూశావా?—". అన్నది లక్ష్మి.

ఆనందరావు 'ఆత్మ'—నిట్టూర్చినట్టు కదిలింది.

"ఐతే నువ్వు ఆత్మహత్యచేసుకున్నతర్వాత నేను చచ్చానన్నమాట! నా కథ విను. నేను ఒకఆఫీసులో గుమాస్తాను. నాకూ కొన్ని చిరాకులూ వ్యథలూ వున్నయ్యనుకో. ముఖ్యంగా పెళ్ళివిషయం. మాఅమ్మ నన్ను త్వరగా పెళ్ళిచేసుకొమ్మని రాస్తూవుంటుంది. నేను ఎవ్వర్నీ ప్రేమించలేదు — నాకు ప్రేమలో నమ్మకమూ లేదు. కాని చేసుకోవచ్చని వూరుకున్నాను. పైగా ఈ సంపాదన నాకే చాలటంలేదు. ఆమెను కూడా తీసుకొచ్చి — 'సుఖపడదాం' అని వచ్చిన భార్యను కష్టపెట్టటం

నాకు ఇష్టంలేదు. కాని నిన్నకూడా వో వుత్తరంవచ్చింది—ఎక్కడో పిల్లవున్నదనీ, చేసుకుంటేనేకాని వీల్లేదనీనూ. నా పరిస్థితి ఎంత చెప్పినా వాళ్లు అర్థంచేసుకోరు. ఇప్పుడప్పుడే పెళ్ళిచేసుకుంటే సుఖపడ లేమని నేను అనుకుంటాను—చేసుకోకపోతే వాళ్ళకు సుఖంలేదు. ఏం చెయ్యాలో నా కేం తోచలేదు. రాత్రి ఒంటిగంటదాకా గదిలో కూచుని తీవ్రంగా ఆలోచించాను. తల వేడెక్కిపోయింది. లేచి బయటకు వచ్చి, వీధులన్నీ దాటి వూరవతలకు వచ్చాను. ఆలోచిస్తూనే ఆ బావి గట్టుమీద కూచున్నాను: అప్పటికప్పుడే నీ శవం బావిలో వున్నదన్న మాట—— ఈ ఆలోచనతో ఏమైందో తెలుసా? అంతా విధివైపరీత్యం. ఆ సమయానికి నాకు చావురాసిపెట్టివున్నది. బావిగట్టు ఎత్తయిన దేం కాదుగా. నే నా గట్టుమీద వున్నానన్న ఆలోచనకూడా నాకు లేదు. ఏ బెంచీమీదనో కూచున్నాననుకుని, ఎడమచేతిని వెనక్కిచాచి — ఆన్చి చేతిమీద జేరబడదాం అనుకున్నాను. గట్టుమీద కూచునే చేతిని చాస్తూ వెనక్కువంగాను. అంతే; బావిలో పడిపోయాను. పడిపోతువున్నప్పుడు పెద్దగా కేకకూడా వేశాను. ఆ అర్థరాత్రిసమయంలో ఆ వూరవతల నా కేక విన్నవా డెవడు? నాకు ఈతరాదు. బావిలో పడీపడగానే అడుక్కి పోయాను. కడుపునిండా నీళ్ళుపోయినై. ఉక్కిరిబిక్కిరి ఐపోయాను. కాళ్ళూ చేతులూ కొట్టుకున్నాను. నాలోఉన్న ప్రాణవాయువు ఐపోయింది— చచ్చిపోయాను. నా దేం ఆత్మహత్యకాదు. దురదృష్టవశాత్తూ చచ్చిన చావు. నువ్వు చావాలనిచస్తే, నేను చావాలనుకోకుండా చచ్చాను. ఇదీ జరిగిన విషయం. కానీ, తెల్లవారేసరికి— మన శవాలు రెండూ బావిలో కనిపించటం వల్ల - వయస్సులో వున్నవాళ్ళం అవటంవల్ల - ఇంకేముంది? వాళ్ళ కథలకు కావలసినంత ఆస్కారందొరికింది. ఎక్కడలేనివన్నీ పుట్టించారు. అసలు విషయాలు ఈ లోకానికి ఎట్లా తెలుస్తాయ్? తెలుస్తేమాత్రం నమ్మే వా డెవడు? అదికాదు —ఈ రెండుశవాలూ బావిలో కనిపించగానే వెంటనే వీళ్ళకు కలగాల్సింది దురాలోచనేనా? అసలు జరిగినట్టు, 'ఈవిధంగా జరిగివుండవచ్చునేమో' అని ఒక్కడూ ఆలోచించడే!

అట్లా ఎప్పుడూ ఆలోచించరు. అర్థరాత్రివేళ తనభర్తప్రాణాల మీదికివచ్చి ఎవరూ దక్షతలేకపోగా డాక్టరుదగ్గరకు ఎవత్తన్నా వెళ్తూ

వుంటే 'ఇది ఎవడికోసమో ఈ రాత్రి బయల్దేరింది.' అని అనుకుంటారే గాని-'అయ్యో పాపం, ఇటువంటి సమయంలో వెళ్తోంది-ఈమెకు ఏ కష్టం వచ్చిందో' నని ఎవ్వడూ ఆలోచించడు."

"నీచపు బుద్ధి"అన్నాడు అనందరావు.

"కాని బావిగట్టుమీద అజాగ్రత్తగా ఎందుకు కూచున్నావు నువ్వు? చూసుకోరాదా?" అని మందలించింది లక్ష్మి.

"సరేలే.అంత జాగ్రత్తవుంటే చావకనేపోయేవాడిని. ఐతే నువ్వు ఆత్మహత్య చేసుకోటం క్షమించరానిది"అన్నాడు ఆనందరావు.

లక్ష్మి ఈ లోకంకేసిచూసింది. "కాదు ఇటువంటి నీచపు లోకాన్ని వదిలిపెట్టడమే మంచిదయిందని ఇప్పుడు అనుకుంటున్నాను. మా ఆయనలేకుండా నేను మరో రెండురోజులు వంటరిగా బ్రతికాననుకో-మరిన్ని అభాండాలు వచ్చిపడేవిగా. ఇంతకూ ఆయన ఎక్కడ వున్నారో — ఏమైనారో........" అన్నది లక్ష్మి జాలిగా.

"మీ ఆయన దొరికాడనుకో. అసలువిషయం చెప్పి నేను వీళ్ళ ద్దర్నీ బావిలోకితోసి చంపలేదంటాడు-వాళ్ళు వింటారంటావా?"

"వినరు. వినేటంత సహృదయం వాళ్ళకుండదు. వాళ్ళంతా నీచంగా జీవిస్తున్నారు. కాబట్టి ఇతరులూ అంతే అనుకుంటారు. ఈ నాటికయినా వీళ్ళపీడ విరగడయింది-థూ," అన్నది లక్ష్మి ఆ గగన మార్గంనుంచి భూమిమీదకు ఉమ్ముతూ.

'కాదు. నిజం నిలకడమీద తేల్తుందని అంటారు. అట్లా ఒకవేళ ఈ నిజంతెలిశాక మనమీద ఈ అభాండాలూ, నిందలూ మోపిన ఈ వెధవల ముఖాలు ఎట్లావుంటై? వీళ్ళందరికీ వరసనా ఉరిశిక్షవెయ్యాలి!" అన్నాడు ఆనందరావు వుక్రోషంగా.

ఆ విషయంగురించి ఆ రెండు ఆత్మలూ మళ్ళీ చర్చించలేదు. ఏవో విషయాలు ఆలోచిస్తూ వెనక్కుతిరిగి చూడకుండా తాము చేరాల్సిన మరోలోకానికి వడివడిగా పోసాగినై.

—:o:—

# చిఱుచేమంతులూ-చందనం

కల్యాణసుందరీ జగన్నాథ్

అంతరిక్షం దీపాలు వెలిగించుకున్నది. ఆ నక్షత్రాల వెలుగులో లోగిలివెనక మండువాలో నించునుంది అలివేలు పూసినతంగేడులా.

కనుమరుగుగా దేవుడిగుళ్ళోకి వెళ్ళాలి. ఒంటరిగా రాత్రి బయలుదేరడం ఇదివర కెన్నడూ అలవాటులేదు. కాని ఆ విషయం తనకి గుర్తైనారాలేదు.

చుట్టాలతో పక్కాలతో ఇల్లంతా కిసకిసలాడుతూంది. పచ్చి తాటాకు పందిళ్ళూ, మామిడాకుతోరణాలూ, పసుపు-కుంకం, మల్లిపూలూ, గంధం, ఐరేనికుండల సొంపు, పిల్లల పరుగులూ, పెద్దల చిరునవ్వులూ, వరసయినవాళ్ళ సరసాలూ- పెండ్లి నిండుతనం సందడిఅంతా పందిరి నిండా గుబాళిస్తూంది.

అంతవరకూ కన్నీరు మున్నీరుగా ఏడ్చింది అలివేలు.

అందరూ ముందరపందిట్లోనే ఉన్నారు. ఘుమాయిస్తోంది ఉక్క, ఆ పగటివర్షానికి. అకాలపువాన. పెద్దజల్లు విసిరింది. పెండ్లికి వేసిన ప్రహరీబచ్చళ్ళ అడుగులు తుడుచుకుపోయాయి........

తల్లి పాలుచాలకపోతే పాలిచ్చి, తనని ఎత్తుకుదించిన నాగమ్మ ముఖం చీకటిక్రమ్మింది.

“ఆఁ! ఏంలేదు. మన్నెపుతొలకరి. ఇక్కడా కాసంత ఇసురు ఇసిరింది,” అంది పైకి. పెళ్ళిబచ్చళ్ళు కరగకూడదని పెద్దలంటారుగా తప్పని. నాగమ్మ గుండె బరువైంది. “గంగిగోవులాంటిది. బెమ్మ ఎట్టా రాసిపెట్టాడో!” తనలోతాను భయంగా గొణుక్కుంది.

♦ ♦ ? ♦

సత్యమూ, తనూ కలిసి పెరిగారు. వాళ్ళపొలాలు కాడిగట్టువి. సత్యంచెల్లెలు జానకితప్ప అలివేలుకి అంత జతకత్తె ........వేరేలేదు. ఆ వూళ్ళో. వాళ్ళపెద్దవాళ్ళూ వరసలెట్టుకుని పిల్చుకునేవాళ్ళు.

కంచాన పాలూ అంచున వెన్నా పెట్టి పెంచింది, సత్యాన్ని వాళ్ళమ్మ. కడసారపుకొడుకు. అతను ఆడిందాట, పాడింది పాట.

చిన్నప్పుడు బడిపంతులుగా రొకసారి పలకమీద 12 అంకె వెయ్యమంటే, 11 అంకెవేసి 12 అన్నాడు_అది త్రికరణశుద్ధిగా పన్నెండే నని నమ్మి. కాదని పంతులుగారు కొట్టారు. సత్యానికి కోపంవచ్చింది. తనని ఇంకొకళ్ళు కొట్టడమే! ప్రక్కకుర్రాడు అతని పలకచాటుగా గుసగుసలుగా ఎంతోచెప్పాడు తప్పని. సత్యం తన నమ్మకం వదల లేదు — ప్రాణంపోయినా సరే, తను నమ్మింది నిజమనుకున్నాడు. మరో నాలుగు దెబ్బలు తిని చదువుచాలించాడు.

ఇకను, బుద్ధితెలిశాక తనంతటతాను వృద్ధిచేసుకున్న చదువే.

పైన కాస్తమబ్బుపట్టగానేసరి, అలివేలూ, జానకీ, సత్యం వాళ్లంతా "వానొచ్చె పెద్దమ్మా వడ్లుతియ్యి పెద్దమ్మా" అంటూ పరికిణీలూ, జడ కుచ్చులూ గిర్రునతిరిగేటట్టు గిరగిరా చేతులుచాపుకుని గుండ్రంగా వాకిళ్ళన్నీ తిరుగుతూ ఆడుకునేవాళ్ళు.

వివరాలొస్తున్నాయి వాళ్ళకి. ఒకనాడు జానకిచేతిలో ముల్లువిరిగింది. పచ్చనిచెట్టుకేసి చూస్తుండమని జానకిచేతిలోనించి కుట్టి, ఆ ముల్లు తీసే సింది అలివేలు అతిసుతారంగా. కాని జానకికి చురుక్కుమని గుచ్చు కుంది కుట్టు. "రాకాసి వదిన" అంది నవ్వుతూ. ప్రక్కన నిలబడిఉన్న సత్యం అలివేలుముఖంలోకి చూస్తూ చిరునవ్వునవ్వాడు. అలివేలు మహా ఉడుక్కుపోయింది.

ఆటలతో పాటలతో బాల్యావస్థ ముగ్గురికీ గడిచిపోతూంది.

రామిలేరు చీలమండలు తడవదు. కాని అదేమి విసురో? పావడాలూ కుచ్చెళ్ళూ చేతపట్టుకుని ఆడపిల్లలంతా దాటుతున్నారు. పాదాలక్రింద యిసక కొట్టుకుపోతూంది. పాదాలు తేలిపోతున్నాయి. సత్యం జానకిని తనచేతులమీద ఒడ్డుచేర్చాడు. తిరిగివెళ్ళి అలివేలుని కూడా ఎత్తుకునివచ్చాడు అల్లాగే. గట్టుమీద ఛటుక్కున వదిలేసి, కుడి తిసీ, జుట్టూ సర్దుకుని గబగబ వెళ్ళిపోయాడు. అలివేలుకి బిడియం, కష్టంకూడా వేశాయి....

ఆ సాయంత్రం గూళ్ళుచేరాక "ఎక్కడికెళ్ళావే అమ్మాయ్?" అంది అలివేలు బాబమ్మగారు. "జానకీ నేనూ రామిలేరు గట్టుమీదికి జాంపళ్ళకోసం వెళ్ళాం" అంది. "ఓసి! నీ యాగడం చల్లగుండ;

ఇద్దరాడపిల్లలు ఒంటరిగా అంతదూరం వెళ్తారా? అదుపులేని గుర్రాలు అగడ్తలు దాటినాయని," అంది బాబమ్మ.

"ఇద్దరంకాము. సత్యంకూడా వున్నా"డని అనబోయింది, కాని నోరురాలేదు.

నాలుగు సంక్రాంతులుగడిచాయి.

◆ ◆ ◆ ◆

"వీడి కొంద్రెంత? వీడి బ్రతుకెంత! మరి రెండరకలుంటే వీణ్ణి పట్టపగ్గాలుండేవిగావుసుమా!" అంటూ ఇంటికొచ్చాడు అలివేలుతండ్రి రమణయ్యగారు.

"ఎవరు?" అందిభార్య. "సీతప్పగారి సత్తెం తనచేలో బోది లూడ్చుకోమన్నాడంట మళ్ళా వాళ్ళ పాలేరుని. విన్నావా! బోదులు! ఇట్లా చేస్తే మన చింతాలు రెండుమళ్ళు వదిలిపెట్టమంటాడు నన్ను రేపట్నించీ—ఆఁ! ఖాయంగా! నేర్చుకోరా, అంట!"

◆ ◆ ◆ ◆

ఊరిమధ్య దిబ్బమీద జువ్విచెట్టుప్రక్కన పండక్కి కట్టిన పెద్ద తాటిబద్దలఉయ్యాల అందరూ ఊగుతుంటే, జానకీ, అలివేలూకూడా తయారయ్యారు. భయస్తురాలని తెలిసి అలివేలుని గట్టిగా ఊపారు—మరి కాస్త—కళ్ళుతిరిగాయి. ఏడ్చి మొత్తుకుని దిగేసి, జానకిభుజంమీద తల పెట్టి కళ్ళు గట్టిగా మూసుకుంది. చెఱువులో ఎడ్లకి నీళ్ళుపెడుతూ సత్యం చూశాడు. గబగబ తోకత్రొక్కిన త్రాచులా వచ్చి, దూరంగా వుండగానే "అమ్మాయ్ జానకీ, ఏం చిలిపిచేష్ట లివ్వి! పదండి ఇంటికి ముందర" అని ఒక్క అదలకింపు అదలకించి, "పడి కాళ్ళూ చేతులూ విరగ్గొట్టుకో టానికా?" అన్నాడు. అలివేలుని బలవంతంగా లాగుతున్న పిల్లలంతా చేతులువదిలేశారు. "పద పోదాం" అంది జానకి నిమ్మళంగా.

జానకిభుజంమీద చెయ్యివేసుకుని కాళ్ళీడుస్తూ అలివేలు వెనక్కితిరిగి చూచింది. సత్యం అక్కడే నిలబడి చూస్తున్నాడు. అలివేలుహృదయం నిండిపోయినట్టయింది. అతని అవ్యక్తప్రేమని గ్రహించు కోగలిగింది.

ఆ రోజంతా సత్యం కళ్ళలో మెదుల్తూనేఉన్నాడు అలివేలుకి.

ఆ యేడు కోతలయ్యాక, ఒకనాడు, రమణయ్యగారు ఇంటికి రాగానే "ఈ సత్యంగాడికి వెఱ్ఱితలలేస్తున్నాయి! ఈ వేళ నూరిపిడిలో ఎడ్లు కంకులుతింటుంటే, ముట్టిమీదేమో కాస్త వేశాడంట చిన్నపాలేరు. అమట్న వాడిచేలోనుంచివచ్చి సరాసరి కడియంలోకి జొరబడిపోయి వీణ్ణి రెండు లెంపకాయలేశాడంట. పైగా "అడ్డగాడిదలాగ నోరులేని జీవాన్ని నోటిమీద వేస్తావురా? వాటి కష్టమంతా తింటానూ! అది తింటేఏరా అడ్డె డొడ్లు కష్టపడేటప్పుడూ. ఉన్నగింజలు చాలవురా మీకు," అని ఇంకా ఏ వేవో పిచ్చికూతలుకూడా కూశాడంట. అసలు వాడి కెందుకూ అంట, ప్రక్కమడిలో గొడవ."

"అదేం" అందిభార్య.

◆ ◆ ◆ ◆

ఒకనాడు చద్దన్నాలయాక "యేటిగట్టుకి నేరేడిపళ్ళకి పోదాం రా" అంది జానకి.

చేలోకి వెళుతూ సత్యం చెట్టుదగ్గిరఆగి, పెద్దపెద్ద పళ్ళున్నకొమ్మలు దులిపాడు. జానకి ఏరుతూంది.

"మీ అయ్య సమ్మంధం వెతుకుతున్నాడంటగా?" అన్నాడు సత్యం, అలివేలుకి కొంచెందూరంగాచతికిలబడుతూ.

అలివేలు కాళ్లుచాపుకు కూచుంది. జానకి చిన్నముతావాళ్ళనందరినీ బెదిరించి ఏరుకుంటోంది ఆబగా.

"ఏం మాట్లాడవేం?" అన్నాడు. తిరిగి "ఏం మాతో చెప్పకూడదా?"

అలివేలు తలవంచుకుని, నేలమీద పాకుతూన్న గండుచీమని పరీక్షిస్తూంది.

"ఊళ్లోనే కలిగినవాళ్ళని వెతుకుతున్నాడంటగా మీ అయ్య. నిజమేనా?" అన్నాడు సత్యం ప్రశ్నను రెట్టిస్తూ........

"ఉన్నఆస్తి చాలదా మీకు?"

అలివేలు మాటాడలేదు.

"నీకేమన్నా మూగినోమూ గట్రా వుందాఏం? మాట్లాడవూ? ఇదిగో ఒకసా రిటు చూడు" అన్నాడు సత్యం.

నీళ్లుకమ్మినకళ్లు పైకిచూచాయి. "నాకు తెలవదు" అంది నిమ్మ

శంగా. వెంటనే "అమ్మోయ్!" అని అరిచి కాళ్ల గాబరాగా దగ్గిరకు లాక్కుని, కాలిబొటనవేలు చేత్తో తడుముకుంది.

"ఏం? ఏం?" అన్నాడు మరీ గాబరాగా సత్యం.

"చీమ" అంది. "గండుచీమ కుడితే తేలుకుట్టినంత తీపి" అంటూ అక్కడేపడివున్న పచ్చిరొబ్బతో నలిపేశాడుచీమని. చీమ రెండుతణాలయ్యి కొట్టుకుంటోంది. "చంపెయ్ చంపెయ్యి." అంది భయంగా అలివేలు.

"బయ్యమేఁ?" అన్నాడు చిరునవ్వుతో, తిరిగీ ఒకదెబ్బతో చటుక్కున చంపేసి.

"ఊహుఁ! అదికాదు. కొనూపిరితో ఉంచకూడదంటగా పాపం. ఊపిరుంటే, ఏ కొంచంవున్నా దేముడుతో చెప్పుతాయంట."

"పిచ్చిపిల్లా! సుతిమెత్తనిగుండె నీది." అన్నాడు తృప్తిగా సత్యం.

"ఏమయిందేం? ఏమయిందీ?" అంటూ వళ్ళో పళ్ళుమోసుకుని గబగబా వచ్చింది జానకి.

ఆ రోజంతా మతి మతిలోలేదు అలివేలుకి. ఒకవేపు ఏడుపూ, ఒకవేపు సంతోషం ఉబికివచ్చేయి.

రోజులుగడుస్తూన్నాయి.

* * *

ఒకసారి, హడావుడిగా, సత్యం వస్తూ "ఇదిగో చూడు, మన జమీందారుగారు రంగారావు గారెంత మంచివాడనుకున్నావు? మొన్నటినించీ మాకు శానా స్నేహంకలిసింది. దూడకి లేతపరకలకోసం చేలోకి వెళ్ళాను. వాళ్ళ కారు ఆగిపోయింది. రోడ్డువద్ద నన్నుజూసి సొతంత్రంగా 'కొంచెం తొయ్యాలి తమ్ముడూ,' అన్నాడు. హొరా వీరా అని కేకేసి నలుగుర్నీ పోగుచేశాను. ఇంటివరకూ తోశాం. లోపలి కిరమ్మన్నాడు. ఇంట్లో అందరూ వెళ్ళాక చానాసేపు మాట్లాడాము. అసలు నేను కాంగ్రెసువాదినై పోదా మనుకుంటున్నాను. బస్తీకెళ్ళి అయినాసరే. ఇక్కడైనాసరే," అన్నాడు ఏకధాటిగా

"అంత ఉద్యోగం నీ కెట్టా వస్తాది?" అంతచదువు చదవాలగదా?" అంది అలివేలు, విచారంగా.

"ఓస్ వెర్రిపిల్లా, అదిఉద్యోగంగాదు. అదిఒకసేవ దేశంకోసం. అబ్బో! ఇంకాఎన్నో సంగతులుచెప్పారు. మనగాంధిగారుచెప్పిందీ అదేనంట. ఇంకాచాలాఉందిలే. ఆయన అపుడపుడు వస్తావుండమన్నాడు కూడా. వారి చెల్లెలు రాంభాయమ్మగారు పట్నంనించీ పెద్దచదువు చదివి వచ్చిందంట. ఏం స్వతంత్రం! ఏం కథ! ఎదురుంగా వచ్చి పలకరించేసిం దంటే! పేరుఅదీఅడిగింది. అసలునేనుచేతిలోవున్నదూడగడ్డి వాళ్లకుర్చీలో వదిలిపెట్టివచ్చా మరిచిపోయి. రెండుమెట్లు దిగానో లేదో, గుమ్మం లోకి వచ్చి, పేరుపెట్టి పిలిచి ఆ గడ్డి చేత్తో నా కిచ్చిందంటే! చిరునవ్వు తోటి!!" అన్నాడు సత్యం. "ఏం చక్కనిచీర కట్టిందనుకున్నావూ!" అన్నాడు గుక్కతిప్పుకున్నాక.

త్రిప్పుకునేవున్న అలివేలుమొఖం చిన్నబోయి ఓ చాయ చెన్ను దరిగింది.... ఎందుకో వివరంగాలేదు తనకే.

"అట్లాంటి చీరగట్టి నువ్వు ముస్తాబయితే చూడాలనివుంది." అన్నాడు సత్యం.

అలివేలుమనసు ఉప్పొంగిపోయింది.

* * * *

అలివేలుకి సబంధం గట్టిగా చూస్తున్నారు.

ఒకనాడు, ఆకుమళ్లరోజుల్లో, కాడిగట్టుమీద కాళ్ల గోరింటాకు కడిగేసుకుంటున్నారు ఇద్దరాడపిల్లలూనూ. పొలంలోనించీ చూసి వచ్చాడు, సత్యం.

"మీ బాబుగుణం నాకు నచ్చలేదు. కుమ్మరావంలో ఇత్తడికుండ పుట్టినట్టూ నువ్వు పుట్టుకొచ్చావుగాని ఆ పుణ్యశాలికి అతనికి డబ్బేదేముడు. అతనితో నేనుగాని నా వాళ్లుగాని ఎళ్లి సంబంధం మాట్లాడతారన్నమాట బ్రహ్మకల." అన్నాడు. కొంచమాగి, "తీరా మే మడిగితే పుసుక్కుని కాదూ కూడదని అత ననేస్తే—నే నసలే ఉగ్గబెట్టలేని మనిషిని. ఇక శ్రుతి మించుకొస్తాది." అన్నాడు సాచ్చుకునిఉన్న తుమ్మమొద్దుమీద జారిగిల పడుతూ. అలివేలు కళ్లప్పగించి ఊరుకుంది. నోటమాటరాలేదు. "ఇక నేమిగతిరా దేముడా!" అనిపించింది లోపల. బావ పట్టువదిలేనా!

సత్యం మరికాస్సేపాగి తదేకదృష్టితో "నాకేంచెయ్యాలో పాలు

పోవటంలేదు పిల్లా!" అన్నాడు. "సన్యాసినై ఎందైనాబడిపోదామా అని పిస్తావుంది. ఒక్కొక్కసారి పిచ్చిపట్టినట్టవుతాది" అన్నాడు నిదానంగా.

అలివేలుగుండె గబగబా కొట్టుకుంది. కళ్లుమూసుకుని సత్యం కాళ్లమీదపడి దేవుడికి దణ్ణంపెట్టాలనిపించింది. కాని చేతులూ కాళ్లాడలేదు.

"అస్తుదేవత యింటారంట బావా, తప్పు. అట్టా అనబోక" అంది కాస్సేపాగి ధైర్యం చిక్కబెట్టుకుని.

కార్తి వెళ్లి కార్తి వస్తోంది.

♦ ♦ ♦ ♦

"మీ వాళ్ళతో నివ్వు చెప్పు. మా అయ్యా నడగమని" అంది నిమ్మళంగా ఒకనాడు సీమతుమ్మపండ్లు కోస్తూ.

"ఛస్తే నేనే! మీ బాబునే ఉహుఁ! నా పొడతనికి గిట్టదు. అతనంటే నాకు గిట్టదు" అన్నాడు అందనికొమ్మని అలివేలుకి వంచి అందిస్తూ. అందుకోకుండా కొమ్మ వదిలేసింది....

కళ్లనిండా నీళ్లునిండాయి.

పిలవచ్చిన పాలేరుతో కలసి సత్యం వెళ్లిపోయాడు.

"ఇంతలేసి పళ్లుండంగా ఈ లేతపిందెలు కోస్తావేం?" అనిగసిరింది జానకివచ్చి. సత్యం ఆలోచిస్తున్నాడు దీర్ఘంగా. కాలంగడచినకొద్దీ సత్యం మనసు కరిగించమని అలివేలు దేవుళ్ళకి మ్రొక్కుకుంటోంది.

* * *

మండుటెండల్లో లేగని వెతుక్కరాబోయి వడదెబ్బతిన్నాడు సత్యం. జ్వరంవచ్చింది.

అలివేలుకి దూరపుసంబంధం నిశ్చయంచేశారు, అవతలవాళ్ల డబ్బునిబట్టి. వెనకాముందు ఆలోచించకుండా ముహూర్తంపెట్టేరు.

సత్యానికి "సన్నిపాతజ్వరం. తిరగదు. గండం" అన్నాడు పేరంటాలయ్య. అతను భూతవైద్యుడుకూడాను ఆ గ్రామానికి. ఆ మాట వినగానే జీవచ్ఛవంలా గయిపోయింది అలివేలు. యజ్ఞపశువులా పెళ్ళి కొప్పుకుంది. కాని మనస్సులో ఏమీ సోకటంలేదు. సత్యం ఒక్కడితోనే మనస్సంతా నిండిపోయింది. అంత గండం అతని కొచ్చినప్పుడు తానే

మయితేనేం? బ్రతికితేనేం ఛస్తేనేం?

సంబంధం నిశ్చయమైన తరువాత బ్రమిరే బరువై పోయింది అలి వేలుకి. ఒకనాడు నాగమ్మవడిలో పడి వెక్కి వెక్కి ఏడ్చింది. "ఆడ బతుకుకింతే మాయమ్మా! పుట్టింటిని, అయినోళ్ళనీ వదిలి అందరమూ ఎళ్లాలిసిందే. బయ్యంలేదులే," అని సముదాయించింది నాగమ్మ దగ్గిరకు తీసుకుని. కాని ఎండకి ఎండి, వానకి తడిసిన నాగమ్మకి ఏదో బిడ్డ మూగ బాధపడుతున్నట్టే తోచింది.

జ్వరం మొదటిరోజుల్లోనే జువ్విచెట్టుక్రింద నిలబడ్డాడు సత్యం అలివేలుఇంటికేసి చూస్తూ. ధైర్యంచేసుకుని అలివేలు సందెచీకటిలోనే ఎదురుగా వెళ్ళి ముఖం చేతులతో కప్పుకుని నిశ్శబ్దంగా ఏడుస్తూ నిల బడ్డది.

"నే నాలోచించాను. భయపడొద్దు. నేను జమీందారుగారితో మీ బాబుకి చెప్పిస్తాను. నా కంఠంలో వూపిరివున్నంతవరకూ ఆ పెళ్ళి జరగ నివ్వనులే. రేపే రంగారావుగారితో మాట్లాడతాను" అన్నాడు నీరసంగా. ఎక్కడో అడుగుల అలికిడయింది. "నీవు పద, మొదట ఇంట్లోకి. ..ఇక నేనూ నుంచోలేను. కాళ్లు పట్టివ్వడంలేదు" అన్నాడు.

నిర్జీవప్రతిమలా అలివేలు తనగదిలోకి, వెయ్యి తలపులతో వచ్చి పడ్డది.

* * *

"సీతమ్మగారి కనిష్టుడిమాట నమ్మకంలేదమ్మా గుణంకూడా పుట్టు కొచ్చిందంట, పాపం!" అంది నాగమ్మ రెండురోజులతరువాత___

"పెళ్ళిపందిట్లో అదేమ్మా టే? పిచ్చిదానా. అయినా పాపం ఎంత చేసుకున్నమ్మకంత! సీతమ్మ గ్రహచారం కాకపోతే ఏమిటి" అంది అవ్వగారు ఉట్టిమీది నెయ్యిదించుతూ.

వారంరోజులు వరస్సగా కనబడకపోతే రంగారావుగారు స్వయంగా ఆచూకీ తీసి, వచ్చి సత్యాన్ని చూచిపోయారు.

* * *

కాని ఆ సాయంత్రం ముస్తాబయిన పెళ్లికూతురికి ఇవ్వేవీ మతిలో పోకలేద్దు. బ్రతుకే ప్రార్థనయింది. సత్తెంబావ బ్రతకాలి. తానేమైనా సరే.

కావలిస్తే తాను బలి ఉంటుందిగా!

దేముడిగుడికి కదిలింది. అలివేలు ప్రదక్షిణంచేసింది. పరమాణువులోనూ, బ్రహ్మాండంలోనూ ఉన్నకదలిక, ప్రదక్షిణం. పరమాణువులలో రేణువులూ, అనంత విశ్వంలోని సూర్యమండలాల్లో గ్రహాలు చేసే ప్రదక్షిణం సూత్రప్రాయంగా చెయ్యమన్నారు పెద్దలు. అలవాటుగా గుడిచుట్టూ తిరిగింది అలివేలు. దణ్ణంపెట్టింది. ఏడ్చింది. సత్తెం బ్రతకాలి.

* * *

ఆ రాత్రి, "చూచావా నాగా, ఈయనగారి పని. మరికాసిని వడ్లు దంపించివుంచితే ఏం? ఆయనగారి పనులన్నీ ఇంతే. రేపటి సువ్వారాలకి బియ్యంచాలవుగదా ఎట్లా?" అంది అలివేలుతల్లి, చేతులునలుపుకుంటూ.

"ఏం బియ్యంలేదులే. తూర్పారకముందు నీ కందిస్తాను" అంది నాగమ్మ.

తూముడువడ్లు గరిసెలోనించి దింపించి వెనకవాకిట్లో గుంటలో పోసింది—బాగుచేసి. చింతాలూ, అతని మరదళ్లిద్దరూ పోటువేస్తున్నారు వెన్నెలలో.

తన గది కిటికీలో, గుంటకెదురుగా, గువ్వలాగు కాళ్ళుముడుచుకుని, తలవెనకికి తలుపుకి జారవేసుకుని చెక్కిళ్ళనిండా కన్నీళ్ళు కారుతూ కూచునివుంది అలివేలు.

"నాగప్ప పదాలు పాడాలి. లేపోతే నిద్రొస్తావుంద"న్నారు చింతాలు మరదళ్ళు.

"ఆఁ! నా పిచ్చిపదాలకేంగాని ఎయ్యండిపిల్లా పోటు. అయినా నా కేం కుశాలగాలేదు ఇయ్యాల" అంది నాగమ్మ తనూ రోకలి పుచ్చుకుంటూ.

సత్యంగారి పాలేరు, పోతురాజు, చింతాలుదగ్గరికి పుగాకొచ్చాడు. రాత్రంతా నిద్రకాస్తూ.

"మీ కావందు కెట్టావున్నట్టు?" అన్నాడు చింతాలు.

"రాత్రి సందెకాడ బత్తినించీ డాకటేరుని తీసుకొచ్చాడుగా జమీందారుగారు. మా పెద్ద చెయ్యంటళే. అదేంమందో అదేంకతో, జీవ

దారపుల్లల్లె పనిచేసిందంటే; ఇక పరవానేదంట. బతుకుతాడంట. నీ కింకా తెల్దా?" అన్నాడు పోతురాజు.

"మా మంచోడయ్యా. మా గొప్ప స్నేహాలు చేసాడుగా. కని కారంగలోడు మారాజు," అన్నాడు చింతాలు.

పోతురాజుస్వరం వినబడగానే అలివేలు చెవులురిక్కించుకుని ఉన్నది. అదృశ్య దేవతలకి చేతులు జోడించింది.

మతివచ్చేటప్పటికి నాగమ్మ పిచ్చిపదం వినబడుతూంది.

"వేసవ్వికాలాన పూసేను బూరగలూ," ఊం.... ఊం. ఎయ్యండి పిల్లా ఎయ్యండి...

"ఆసితో సిలకలూ ఆపనెలలుండే
పువ్వుపూసేవరకు పుడికొమ్మనుండే
కాయకాసేవరకూ కడకొమ్మనుండే
పండుపండేవరకు పలవల్ని ఉండే
తినబోతె దూదాయె, తీపి లేదాయె
మళ్ళండి చిలకల్లార మనమన్నె బూఁవులకూ...."

* * * *

అలివేలు కదిలింది. పల్చని చీరలోనించీ నెలవెలుగులో, మసకగా మెరిశాయి మెళ్లో మంగళసూత్రాలు...చెమ్మగిల్లిన కన్నులమల్లె....

——:o:——

# విలువలు

"జ్యేష్ఠ"

ఇద్దరూ ఆ మధ్యాన్నపు ఎండలో నడిచివచ్చి ఆ బట్టలదుకాణం ముందు ఆగిపోయారు.

కన్నయ్య ఇంతకు ముందెప్పుడూ అలాంటి 'షాపు'లోకి నడిచి ఎరగడు. అత నెప్పుడూ తనకి కావాల్సిన ధోవతులు తమఊళ్ళోనే ఉన్న నేతగాళ్ళదగ్గర కొనేవాడు. ఇక అతని పెళ్లాంచీరెలమాటా? ఆమె ఇంతవరకూ పుట్టింటినించి వచ్చేటప్పుడు తెచ్చుకున్నవాటితోనే గడుపు తోంది.

కన్నయ్య చెప్పులు బయటవిడిచి లోపలికి నడిచాడు, అది తన సొంత ఇల్లు అనుకుంటున్నవాడిలాగా; కాని అదంతా చూసేవాళ్ళకి పైకి అంత గంభీరంగా కనిపిస్తున్న కన్నయ్యకి మనస్సులో ఎంతో జంకుగాఉంది. వాళ్ళు తనని మెడపట్టుకు బైటకుగెంటేసినా అతను ఆశ్చర్యపడేలాలేడు. తను ఏదో కొనడానికే వచ్చాడనీ, దారితప్పికాదనీ వాళ్ళకి వెంటనే తెలియపచ్చకపోతే అంతపనీ చేసేస్తారనుకుంటున్నట్లు 'మా ఆడోళ్ళకి చీర్లు కొనాలండి—' అని ఏదో తప్పు ఒప్పుకుంటున్న వాడిలాగా చెప్పేశాడు అక్కడున్న గుమాస్తాని చూస్తూ. అతనికి ఆ క్షణంలో దుకాణంలో ఉన్న ప్రతిమనిషీ తన భావిని శాసించేవాడిలా కన పడ్డాడు. వాళ్ళతో తనరాకకి కారణం చెప్పేసి, వెనక్కి తిరిగి బుల్లెమ్మ నుద్దేశించి "లోపలికి రాయే పర్లేదు" అని దుకాణంయజమానిమొహం లోకి చూశాడు. పైమీద గుడ్డతో మొహం తుడుచుకుంటూ భార్య రాకని పర్యవేక్షించాడు. అంతవరకు ఎండలో నిలుచున్న బుల్లెమ్మ సిగ్గుపడుతూ లోపలికి వచ్చింది

'ఎలాంటి చీరెలు కావాలీ' గుమాస్తా మామూలుగానే అడిగాడు. కన్నయ్య ధరించిన రైతువేషం, రైతుమొహం, రైతుభయం చూసి అతను లోకువకట్టలేదు. కన్నయ్యమాత్రం వాళ్ళ మెరిసే చొక్కాలనీ, ఇస్త్రీతో బిరుసెక్కిన పంట్లాలనీ చూస్తూ, వాటితో తన ముతకగుడ్డల్ని పోల్చుకుంటూ సిగ్గుపడ్డం మొదలెట్టాడు. తనకే బుద్ధిలేకపోయింది. తను

ఈ షాప్‌లోకి రాకుండాఉండాల్సింది. .... ఓహో! షాప్‌నిండా అద్దాల బీరువాలు, వాటిలో మెరిసే ఖరీదైన గుడ్డలు, షాప్‌లో పగలుకూడా వెలిగే ట్యూబ్‌లైట్లు, ఎలక్ట్రిక్ పంకాలు.... కన్నయ్య మళ్ళీ చెమట తుడుచుకున్నాడు.

'చీరెలండీ మామూలియి. ఒద్దే అక్కర్లేదండి. ఒకటి చాలు' అని బుల్లెమ్మ మొహంలోకి చూశాడు. బుల్లెమ్మ తల ఆడించింది.

గుమాస్తా చీరెలు తెచ్చి నిర్లక్ష్యంగా అక్కడున్న పెదుపేలికల చాపమీద పరిచేస్తున్నాడు; చీరెమీదున్న చీటీ చూడకుండానే దాని ఖరీదు చెప్పేస్తున్నాడు. వాటిధరలు పదినుంచి పద్దెనిమిది రూపాయలవరకూ ఉన్నాయి. బుల్లెమ్మ మనస్సు ఆ వర్ణనాన్ని చూడగానే కేరింతలు కొట్టింది. బుల్లెమ్మ అక్కడే, కుర్చీలమధ్య చోటుచేసుకుని కుదుపుగా కూర్చొని చీరెల్ని ఎంచడంమొదలుపెట్టింది.

బుల్లెమ్మ చిన్నపిల్లలా అమాయకంగా ఆ చీరెల్ని వేళ్ళతో పట్టుకుని పరీక్షించడం కన్నయ్య సహించలేకపోతున్నాడు. వాళ్లు 'ఏయ్ వాటిని తాకకు ఫో' అంటారని అతని భయం. అతను చుట్టూ భయంగా చూశాడు. గుమాస్తా (బుల్లెమ్మకు ప్రత్యేకం) ఏ చీరె ఎందుకు మంచిదో వాడ్డంమొదలెట్టాక చీరె అసలురంగు ఎలా మారిపోతుందో వగైరా చెప్పుకుపోతున్నాడు. యజమాని టెలిఫోన్‌లో ఇంగ్లీష్ మాట్లాడేస్తున్నాడు—" నొ ఎ డేస్ ప్రైస్ పజ్ ఛేంజింగ్ అని నాకు తెలుసు. అంచేతే ఐ వజ్....డౌట్"

కన్నయ్య దైవంమీద భారంవేసి చుట్టూ చూడడంలో పడిపోయాడు. అతను గుండె రాయిచేసుకున్నాడు. చాలాకాలం గడిచేక బుల్లెమ్మ ఓ చీరె ఎంచుకుంది. అది ముదురు నీలిరంగు చీరె. వెడల్పాటి అంచు. ఖరీదు పదిహేనురూపాయల పధ్నాలుగణాలు. బేరంచేయడం మాత్రం చాలా హుషారుగా చేశాడు కన్నయ్య. చివరకి వాళ్ళని కింద పెట్టి మీదపెట్టి పదిహేనున్నరకి ఒప్పించాడు. డబ్బు చెల్లించారు. గుమాస్తా అది చాలా 'నాణెమైన' సరుకనీ, చీరె పోయినా రంగు పోదనీ హామీఇచ్చాకగాని వాళ్లు బయటకు కదల్లేదు. పొద్దువాలింది. మధ్యాహ్నం కూడుతిని ఓ గంట కూర్చుని బయల్దేరిన వాళ్ళు తిరిగి పొయ్యిరాజేసే

వేళకి ఇల్లుచేరుకున్నారు. అది కన్నయ్య, అతని తండ్రి కలిసి ఒక్క—ఇటిక వాడకుండా కట్టిన తాటాకుల ఇల్లు.

♦ ♦ ♦ ♦

"పదిహేను రూపాయలే"

"నువ్వు మరీని. పదిహేను రూపాయలన్నరట"

"నా మతి మండా ఇంకా పదిహేనురూపాయలే అనుకుంటున్నాను"

బుల్లెమ్మ కొత్తచీరెగురించి తెలిసిన ఆడవాళ్ళు అలాగా, ఇంకా ఎన్నో విధాలుగానూ మాట్లాడుకున్నారు. వాళ్లెప్పుడూ చీరెకోసం ఐదు రూపాయలు ఖర్చుపెట్టలేదు. ఓసారి అచ్చమ్మమొగుడు 'రంగం'నించి వస్తూ ఏడురూపాయల చీరె తెచ్చినప్పుడు అందరూ వెళ్ళి ఆ చీరని తాకి ఎన్నికచేసివచ్చారు. ఇప్పుడు బుల్లెమ్మ కొనుక్కున్న చీరె వాళ్లఅనుభవాన్నే కాదు, ఊహనికూడా మించిపోయింది. అది తెలుగు పౌరాణిక సినీమాలో 'రాక్ అండ్ రోల్' పాటలా చాలా విపరీతంగా తోచింది.

అయితే అందులో బుల్లెమ్మతప్పేంలేదు. బుల్లెమ్మ ఖరీదైన చీరెలమీద మోజుని అవ్యక్తంలోనే దాచేసుకుంది. తను ఇంట్లో పొదుపుగానూ తెలివిగానూ పనిచేసి లాభంచేసినా అందుకు సొంతలాభం కావాలనుకోలేదు. కాని నిన్నరాత్రి కన్నయ్యే మొదలెట్టాడు. అతను 'ఇనాందార్ల'కి ఇవ్వల్సింది ఇచ్చేయగా, ఖర్చులు గట్రా తీసేశాకకూడా బోలెడంత లాభం కనపడింది పొలంమీద. అదంతా బుల్లెమ్మ అదృష్టమని అతనికి తోచింది. రాత్రి కూడు తింటూ అన్నాడు 'నీ కేం బహుమతి కావాలో కోరుకోయే' అని— ఇక మోటారుకారు కావాలన్నా ఇచ్చేసేవాడిలా పైకి అలా అనేసినా అతనికి భయంగానే ఉంది బుల్లెమ్మ తన తాహతుకి మించిన వస్తువు, ఏ బంగారునగో అడుగుతుందని, తను చిన్నపుచ్చవలసొస్తుందనీని. కాని బుల్లెమ్మ అతని భయం, అతని దగ్గరున్న డబ్బు అన్నీ తెలిసిన దానిలా ఒక 'అలాంటి చీర' కావాలంది. కన్నయ్య మురిసిపోయాడు, బుల్లెమ్మ తెలిసి బాధించదు. అంతేకాదు. తెలీకకూడా బాధించదు. అంచేత బుల్లెమ్మ వద్దన్నా ఇంతఖరీదు పెట్టి ఈ చీరె కొనేశాడు.

♦ ♦ ♦ ♦

ఆమె మనస్సులో ఎంత ఉధృతమైన భావాలొచ్చినా ఆమెకదలికలో ఏమీ కనపడవు. పంధొమ్మిదేళ్ళ బుల్లెమ్మ అలాఉండడం లోటో, గొప్ప శక్తో తెలుసుకోడం కష్టం. ఎప్పటిలాగే బుల్లెమ్మ నిశ్శబ్దంగా ఆనందించింది. ఆ చీరెని చూసి ఇంటికొచ్చాక ఒకటి రెండుసార్లు ఆ మడతలో ముఖాన్ని దాచుకుంది. ఆ చీరెది ఒకరకం బిస్కెట్లవాసన. కొంతసేపు చూసి జాగ్రత్తగా తన పెద్ద కొయ్యపెట్టెలో దాచేసుకుంది.

సాయంత్రం ఇంకా పొద్దుగూకకుండానే అన్నం తినేసి వీధిలోకి వెళ్ళిపోయాడు కన్నయ్య. బాగా చీకటిపడి అందరి ఇళ్ళలోనూ పిల్లలు నిద్రకు తయ్యారయ్యాక కూడా కన్నయ్య రాలేదు. బుల్లెమ్మ ఆరు బయట నులకమంచం వాల్చుకు పడుకుని ఆలోచన మొదలుపెట్టింది. కొంతసేపు ఆ చీరెరంగు, వాసన ఎలా ఉండేది ఊహించుకుంది.

ఆకాశంలో తూర్పునించి ఓ చిక్కటి మబ్బు కమ్ముకొస్తోంది. మబ్బులేనిచోట నక్షత్రాలు ఎప్పుడూలేని కాంతితో మెరుస్తున్నాయి. గాలి అప్పుడప్పుడు వచ్చిపోతోంది. చూరుకి ఇవతలగా దానిమ్మచెట్టు పక్కన మంచంమీద వెల్లకితలా పడుకుని బుల్లెమ్మ నిశ్శబ్దంగా ఆలోచించుకుంటోంది.

ఆ చీరెగురించి ఒకవేపు తృప్తి. మరోవేపు ఏదోతెలీని దిగులు. బుల్లెమ్మలో చాలా కలగాపులగపుభావాలు చేరి అల్లరిపెట్టాయి.

త నా చీరెను ఎప్పుడు ఎలా కట్టుకుంటుందో బుల్లెమ్మకు పాలుపోలేదు. తను రోజంతా చీమలా శ్రమించే మనిషి. ఆ చీరె కట్టుకుని తనేం పనిచేస్తుంది. ఆ చీరెకట్టుకుని మడత నలగకుండా, పమిటి చెదరకుండా ఓ ఎత్తైన కుర్చీలో నేలని తాకకుండా కుర్చోవాలి తను! తనకు ఆ చీరె కట్టుకుని బొమ్మలా కుర్చోడం చేతకాదు.

ఆ చీరెను చూస్తే, తాకితే బుల్లెమ్మకు ఒళ్లు పులకించేది. ఏదో దిగులూ కలిగేది. కావ్యాల్లో విషాదంలాగా అదో తీయని బాధ, ఆ చీరె కట్టుకోవాలని కోరిక కలిగితే 'ఆ రోజు వస్తుంది, అప్పుడు....' అని మనస్సును మతిపించేది. అదేదో అద్భుతమైనరోజు అని బుల్లెమ్మ నమ్మకం. ఆ రోజు ఎలావస్తుందో మాత్రం ఊహకూడా లేదు....

'ఆ రోజూ' వచ్చింది. కన్నయ్య పెద్ద 'ఖామందు' అయి పోయాడు. పెద్దకూతురుకి చాలా పెద్దసంబంధం తెచ్చాడు. బుల్లెమ్మకి తెలుసు తను తన చీరె ఇప్పుడు హాయిగా కట్టుకోవచ్చని.

ఇంటిలోపలా, ఇంటి వెలుపలా పెళ్ళిసందడి. బుల్లెమ్మ కొంత తీరికచేసుకుని గదిలోకి వచ్చి తలుపు గడియవేసింది. గుండెలు కొట్టు కొంటుండగా తన కొయ్యపెట్టిమూత తెరచి చీరె బయటకుతీసింది. మళ్ళీ బుల్లెమ్మఒళ్ళు ఆ చీరెని మొదటిసారి తాకినట్లయి పులకించింది. బుల్లెమ్మ ఆత్రుతతో మడతలు విప్పింది. ఇన్నేళ్ళు ఎదురుచూసినరోజు హఠాత్తుగా గోదావరివరదలా వచ్చింది మరి.

ఎప్పుడూ కట్టకపోవడంచేత ఆ చీర కొత్తదిగా ఉండిపోయింది. అది కొత్తచీర!

పొందని అందంలో విలువ ఏమంటే అది పాతపడదు. ఆ అపు రూపమైన ఆనందాన్నే తన చీరని చూసుకుంటూ 'ఇప్పుడుకాదు రేపు...' అని వాయిదాలువేస్తూ అనుభవించింది బుల్లెమ్మ. ఆ చీరెను కొనగానే కట్టిఉంటే దానిమీదమోజు ఓ ఏడాదిలో పోయిఉండేది; అది మరో రెండేళ్ళలో పాతపడిఉండేది. కాని....

బుల్లెమ్మలా అలా చీరెను 'పూజిస్తూ' గడిపినవాళ్ళు ఎవరూ మీకు కనిపించకపోవచ్చు. అలా ఇంకెవరూ లేకపోవడం ఆమె అనుభ వానికి మరీ విలువఇస్తుంది.

కాని బుల్లెమ్మ అంతకంటె అదృష్టవంతురాలే. ఆ చీరె ఇప్పుడు కట్టేసుకుని దానిమీదుండే పదిహేనేళ్ళ మోజూ పోయి ఆ వెలితిని భరించేయోగం ఆమెకు లేదు. ఎందుకంటే ఆ చీరె ఇప్పుడు చీరెలా లేదు; జల్లెడలా ఉంది. పురుగులు చక్కగా ఏవో డిజైన్లువేసుకుని దాన్ని తినివేశాయి. ఆ చీరెని చీకట్లో ఓ దీపంఉందుంచి చూస్తే చుక్కలతో నిండినఆకాశంలా ఉంటుంది.

బుల్లెమ్మ ఆ చీరెను గభాలున గుండెకు హత్తుకుని అక్కడ కూర్చుండిపోయింది. ఆమెకు పెద్దబరువు శాశ్వతంగా తీరిపోయి నట్లయింది. ఆమెకు తెలీకుండా కళ్ళు చెక్కిళ్ళు తడిసిపోయాయి.

———

# "చక్రనేమి క్రమాన-"

పి. శ్రీదేవి

ఆ మహానగరంలో ఈశాన్యంగా ఎత్తయిన కొండమీద ఆ పెద్ద ఆసుపత్రి నగరంలోని నాల్గుదిక్కులనున్న ప్రజలకూ గంభీరంగా, భయంకరంగా కనిపిస్తూంటుంది. రేయింబవళ్లు జీవన్మరణ సమస్యలో కొట్టుమిట్టాడుతున్న వందలాది వ్యక్తులకు నిరంతరమూ నిలయ మది. బ్రతుకుయాతనలన్నింటిలో బలవత్తరమైన మరణయాతనకు బలవంతంగా గురిచేయబడిన అభాగ్యుల కది ఆశ్రయం. బ్రతుకుబరువులన్నిటినీ క్షణంలో సడలించివేయగల మృత్యువుకు భయపడి ఆశతో, పేరాశతో బరువైన బ్రతుకునే బలంగా కాంక్షించే దురదృష్టవంతులకు ఆశానిలయ మది. విలక్షణమైన జీవితాలనే జీవిస్తూ, విజేతలమైపోయామని విర్రవీగే నరమానవుల చరిత్ర లెన్ని ఆ ఆసుపత్రి ఆవరణలో అంతమయాయో ఎవరు చెప్పగలరు! అయితే ఆసుపత్రులన్నీ యింతేనా! మానవచరిత్రలకు స్వస్తివాక్యం పాడడానికేనా? రుగ్మత, అశక్తి మొదలైన బాధలతో కుళ్ళి కుమిలిపోయే మానవులకు అది స్వర్గతుల్యమంటారే? అది అనారోగ్యంతో ఆరిపోయే జీవనజ్యోతిని ఆరోగ్యకరమైన దీపకళికగామార్చి, భవిష్యత్తును పెంచుతుందంటారే? అదీ నిజమే. అరిగిపోయిన మనిషికి మెరుగుదిద్దేది ఆసుపత్రే. అనారోగ్యంతో ఆరాటపడుతూ వచ్చే ఆశాజీవికి శాశ్వతంగా విముక్తికల్గించేదీ ఆసుపత్రే.

కాని ఈ ఎత్తయిన కొండమీద ఈ ఆసుపత్రి తీరు వేరు. అక్కడ అందరకూ అంటే అన్నిరకాల రోగులకూ చికిత్స జరుగదు.

అది నిపుణులైన సరికొత్త వైద్యులతో, అత్యధికమైన సాధన సామగ్రితో, అతి విలువైన ఆధునిక చికిత్సాసాధనలతో బ్రహ్మాండమయిన ఆశయాలతో నెలకొల్పబడిన కేన్సరు ఆసుపత్రి.

"కేన్సరు!" అందుకే ఆ ఆసుపత్రి భయంకరమైనది. అందులోని రోగులందరూ కేన్సరువ్యాధిగ్రస్తులే.

రోజు రోజుకూ కేన్సరు పెరుగుతూంది. రోజు రోజుకు శాస్త్రం పెరుగుతూంది. శాస్త్రం పెరిగిన కొలదీ చికిత్సా విధానాలు పెరుగుతున్నాయి. కొత్త విధానాలు వచ్చేసరికి కేన్సరు కొత్తమార్గాలలో వ్యాపించటం నేర్చుకుంటూంది. పుట్టగానే పోల్చుకుంటే చికిత్సకు పట్టుబడుతుందంటారు. కాని ఎవ రా పోల్చగలిగేది. తనకు తెలియకుండానే తన అవయవాల్లో ఎక్కడో ఏదో జరిగితే అమాయకుడైన రోగి ఏం చేయగలడు? కనబడకుండా, కష్టపెట్టకుండా లోలోపలే పెరిగి ఒక్కసారి నిన్ను కబళించివేస్తాను అని వికటాట్టహాసం చేసే ఆ విపరీతపు వ్యాధిని పోల్చుకోవటం సామాన్యమా!

అంతవరకూ నేనూ ఆరోగ్యభాగ్యానికి వారసుడనే అనే ఏ అదృష్టవంతుని అణువణువులో కేన్సరు ఉత్పత్తి జరుగుతూందో ఏ శాస్త్రజ్ఞుడు చెప్పగలడు? ఒకప్పుడు గోరంత; ఈనాడు కొండంతఅయి పోయే ఆ వ్యాధితత్వానికి ఏ ప్రకృతిశాస్త్రవేత్త సరియైన అర్థం చెప్తాడు? సంవత్సరాల తరబడి నిలచిపోగల ఆ వ్యాధి క్షణక్షణం పెరిగి పోగలదుకూడా. శరీరంలో ఏ ఒక్క అవయవంలోనో పొడచూపే కేన్సరు శరీరంఅంతటినీ కబళించివేయగలదుకూడా. నెలతిరగని పసివాని కన్నులోనూ అదే వ్యాధి; శతవృద్ధుకు వెన్నులోనూ అదే వ్యాధి; వయసు కొచ్చిన కన్నెపిల్లరొమ్ములో అదే వ్యాధి; వయసుడిగిన కని పెంచిన తల్లికడుపులోనూ అదే వ్యాధి.

అందమయిన ఆహ్లాదకరమయిన ప్రకృతివైపరీత్యా లెన్నయినా కవితా వస్తువులు. కాని భయంకరమైన సృష్టివిచిత్రా లెవరికైనా జుగుప్సాకరం.

"అంత జబ్బుచేసి బతికివచ్చాడురా" అనిపించుకున్న అదృష్టవంతులుండరని కాదు. లోకంలో అదృష్టవంతుల సంఖ్యకన్న దురదృష్టవంతుల సంఖ్య ఎక్కువ కదా! ఆ అదృష్టంకొరకు పోటీపడే కదా అంతమందీ అక్కడ చేరేది!——

తూర్పుదిక్కుగా ఉన్న నంబరు 3 స్పెషల్ రూములో మిసెస్ పాణి చిన్నదగ్గు దగ్గింది. తెరను తొలగించుకుంటూ సిస్టర్ లోనికి తొంగిచూసి

"మీకోసం మిస్టర్ పాణి ఫోన్ చేశారు. మీవంట్లో ఎలాఉంది అని అడగ మన్నారు" అన్నది.

మిసెస్ పాణి ఒక నిట్టూర్పు విడిచి "మార్పేమీలేదు, సాయంత్రం నాలుగు గంటలకి రమ్మన్నానని చెప్పండి" అన్నది.

సిస్టర్ వెళ్ళిపోయాక తలగడక్రిందనున్న చిన్న అందమైన పుస్తకాన్ని మళ్ళీ తెరచిం దామె. అదొక డైరీ— కాదు— డైరీలాంటిది. డైరీతెరచి ముందు చివరిపేజీ తెరచిం దామె— మళ్ళీ మధ్యలో చదివింది. మళ్ళీ మొదటి కొచ్చింది. మొదటి పేజీలో ఒక చిన్న చీటీ అంటించి ఉంది. "ఎప్పుడైనా చదవదలిస్తే మొదటినుండి చివరిదాకా చదువు."

చేతి వాచీలో టైము చూసుకుంది. పదిగంటలయింది. మెల్లగా ఫేన్ తిరుగుతూంది. ఎత్తయిన బూరుగుదూది తలగడాలను మరి కొంచెం వీలుగా సర్దుకుంది. మొదటినుండీ చదవాలనే నిశ్చయంతో ప్రారంభించింది. ముచ్చటైన తెలుగు లిపిలో ముందుకు సాగనిస్తూంది రచన.

♦ ♦ ♦ ♦

"పిల్లలు లేరు లేరని మా అమ్మా నాన్నా తల్లడిల్లిపోయారట. ఎలాగైతేనేం ఆదివారం అమావాస్య కలిసిన మంచి ముహూర్తాన నేను పుట్టాను. అంతకు ముందే మా అమ్మ శ్రీరంగం వెళ్ళివచ్చిందట. అందుకే రంగనాథం అని పేరు పెట్టారు.

"సీతారామయ్య అదృష్టవంతుడు. లేకలేక పుట్టినా పున్నమిచంద్రుడు లాంటి కొడుకు పుట్టాడు," అన్నారుట కొందరు హితైషులు.

"అదృష్టమంటే మహాలక్ష్మిది. కొడుకు చూడు పనసపండులా ఉన్నాడు. అచ్చు తల్లిపోలికే," అన్నారుట ఇరుగు పొరుగూ అమ్మ లక్కాలు, కాని.. ........

"నాలుగేళ్ళు తిరగలేదు. అమ్మా నాన్ననీ మింగేశాడు. పిల్లవాడి నొసట అదృష్టం వ్రాసిలేదు," అన్నారుట వాళ్ళే. మరి నాలుగేళ్ళు పోయేసరికి, నాకు సంవత్సరం తిరగకముందు మా అమ్మ చచ్చిపో యింది. నన్ను పెంచే దిక్కులేదని మరి సంవత్సరం తిరగకముందే నాన్న మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు. నాకు నాలుగోయేడు దాటిందని చేసిన

పుట్టినరోజు శెనగల్లో యింకా మొలకలు పెరుగుతూనే ఉన్నాయి. కార్తీకమాసపు వేకువనే స్నానానికని వెళ్ళిన నాన్న మరి తిరిగి రాలేదు. ప్రమాదవశాత్తు మునిగిపోయాడన్నారుట. ఆ తరువాత అంతా ఏదో గోల జరిగింది.

"అమ్మా నాన్నా లేనికొరత ఎలాగూ తీరదు. కాని ఆస్తికి లోపం లేదు. సవతితల్లి అయినా ముద్దుమురిపాలకు లోపం లేదు. ఏడేళ్ళ పిల్లవాడిని చూడు పదిహేనేళ్ళవాడిలా తయారుచేసింది వాళ్ళ పిన్నమ్మ," అనేవారు నే నెవరింటికెళ్ళినా ఆ వయస్సులో—

"సవతితల్లికి పిల్లలు పుట్టలేదు కనుక వీడి అదృష్టం బాగుంది. ఆవిడకే ఒక నలుసుంటేనా వీడిలా గుర్రంలా పెరిగేవాడా! ఆవిడ అంత అభిమానంగా పెంచేదా!" అన్నారు మాతృహృదయాన్నెరిగిన ఔదార్య వంతులైన ఆడవాళ్ళు.

"నా జీవితాన్ని నే నెరగటం అనేది అప్పుడే ప్రారంభమయింది. అంతకుముందువన్నీ యిలా జరిగిందట అలా జరిగిందట అని చెప్పుకో వడం మాత్రమే. గుర్రంలా ఉన్నాడు, వస్తాదులా ఉన్నాడు అని వాళ్లూ వీళ్ళూ అన్నారని మా పిన్ని వాళ్ళందరినీ తిట్టిపోసేది. దిష్టితీసేసేది. నాకుమాత్రం అలా అనిపించుకున్నందుకు గర్వంగా ఉండేది. నిజంగా అలా ఉండేవాడిని.

"అదృష్టమన్న మాటకు అర్థమేమిటో నాకు సరిగా తెలియని వయస్సులోనే-అంటే నాకు పదహారుసంవత్సరాలు నిండీనిండనివయస్సు లోనే-మా పిన్ని నన్ను విడిచివెళ్ళింది. లోకాన్నే విడిచేసింది. ఇప్పు డాలోచిస్తే నా కనిపిస్తుంది, - బహుశా నాకున్న ఒక్క అదృష్టం మా పిన్నేనేమో అని.

"ఇప్పుడూ—అంటే—ఇవాళ జూన్ 20 వ తేదీ 1940 — ఈ పుస్తకం వ్రాయటం ఇవాళే ప్రారంభించాను. డైరీ రాయాలనే ఉద్దే శ్యంతో దీనిని మొదలుపెట్టలేదు. ఆ మాటకొస్తే ఇది డైరీ కానేకాదు. నే నిందులో వ్రాస్తున్నదీ వ్రాయబోయేదీ- ఎందుకో నా జీవితంలో విన దగిన విషయం కొంత ఉంటుందనే ప్రగాఢ విశ్వాసం నాకుంది.—అలా అనిపించిన ఘట్టాలే వ్రాసుకుంటూ పోతాను."

"జూన్ 22, 1940. నిన్ననే వచ్చాయి మా రిజల్ట్సు. నేను బి. యస్‌సి. ఫస్ట్ క్లాసులో పాసయాను. పిన్ని ఉంటే ఎంత సంతోషించేది? పిన్ని చనిపోయేటప్పటికి నేను మైనరుని. పిన్ని నన్ను వాళ్ళన్నయ్యకు అప్పచెప్పింది. ఆయనా మంచివాడే. నా బరువేం మోయనక్కరలేదు. నా ఆస్తిబరువు అయన జాగ్రత్తగానే మోశాడు. నన్ను చాలా ఆదరంగా చూశాడు. వాళ్ళమ్మాయి అమృతవల్లి అందమైన అమ్మాయి...

మిసెస్ పాణి పుస్తకాన్ని మూసేసి కాసేపు కళ్ళుమూసుకుని పడుకుంది. విసుగుగా పక్కకు ఒత్తిగిల్లింది. ఇంతలో దగ్గుతెర వచ్చి లేచి కూర్చుంది. కిటికీతెరపైనుండి ఎదురుగానున్న వార్డు కనిపిస్తోంది. "అమృతవల్లి స్త్రీలవార్డు" అని అందమైన అక్షరాలు పద్దన్నా కన్పిస్తున్నాయి. చిరాకుగా కనుబొమలు చిట్లించి దుప్పటి సర్దుకుని మళ్ళీ పడుకుంది.

పుస్తకం మళ్ళీ తెరుచుకుంది.

♦ ♦ ♦ ♦

మే 12, 1942. అమృతవల్లి అందమైనదే- నేను అందమైనవాడనని అందరూ అంటారు. ఆ అమ్మాయి చాలా చురుకైనది, తెలివైనది. నామీద చాలా ఆశపెంచుకున్నట్లనిపిస్తుంది. నన్ను ప్రేమించిందనుకుంటాను. మరి నేనో! నా కెందుకో ఆమెమీద మమతకలగలేదు. ఆమెలో లోపం ఏమీలేదు. వాంఛించదగిన వ్యక్తే-కాని ఎందుకో ఆమెను నేను ప్రేమించలేదు. అలాఅని ద్వేషించనూలేదు.

జూలై 15, 1942. నేనేమీ అడ్డుచెప్పలేదు. అమృతం "నిన్ను ప్రేమిస్తున్నాను," అంది. వాళ్ళనాన్న 'నీమీదే ఆశపెట్టుకున్నాను,' అన్నాడు. అందరూ వీళ్ళిద్దరికీ ఈడూ జోడూ బాగా కుదిరింది అన్నారు. నే ననుకునేవాడిని- ప్రేమించిన యువతినే పెండ్లాడాలని. కాని నేను ప్రేమించిన యువతి నన్ను ప్రేమించకపోవచ్చు. అమృతం నన్ను ప్రేమిస్తోంది. నాకు తెలుసు. అయినప్పుడు ఆమెను కాదనటం ఎందుకూ- అని మనస్సు ప్రబోధించింది. సరే అన్నాను. జరిగిపోయింది.

♦ ♦ ♦ ♦

మిసెస్ పాణి పుస్తకం మూసేసి తలగడకింద పెట్టేసింది.

ఆవిడ దేన్నిగురించో దీర్ఘంగా ఆలోచిస్తూంది. ఆవిడ ఆలోచనలను భంగంచేస్తూ టకటక జోడుచప్పుడు చేస్తూ లేడీడాక్టరు వచ్చింది.

"ఏమండీ ఎలా ఉంది?" అంది నాడి చూస్తూ.

మిసెస్ పాణి విషాదంగా నవ్వి, "ఎలా ఉంటుంది? కేన్సరులంగ్ ఎలా ఉంటుంది? సగం ప్రాణాలను పోగొట్టుకున్న వ్యక్తి ఎలాఉంటుంది?" అంది.

"అదేమిటి? మీ రంత ఉద్రేకపడితే ఎలాగ? భయంలేదు. తప్పక బాగుపడుతుంది," అన్నది డాక్టరు ఆమెవీపు నిమురుతూ.

మిసెస్ పాణి "నన్ను మోసగించాలని చూస్తున్నారా డాక్టర్? కేన్సరు అంటే ఏమిటో నాకు తెలుసు. అందులోనూ పరిస్థితి విషమించింది అనీ తెలుసు. రెండవ లంగుకుకూడా వ్యాపించిందని నిన్న పెద్ద డాక్టరు చెప్పాడు కాదూ మీకు?" అన్నది డాక్టరుముఖంలోకి సూటిగా చూస్తూ.

డాక్టరు పెదవి కొరుక్కొని, "మీకు మరాటీ వచ్చా! నిన్న డాక్టరుగారు నాతో మరాటీలో మాట్లాడారే!" అంది.

"ఆహా వచ్చును. ఆమాత్రం ఈమాత్రంగా అన్ని భాషలూ అర్థమవుతాయి. ఇండియాలో అన్నిప్రాంతాలూ చూసేశాను నేను."

"ఇంత తక్కువ వయస్సులో!" అన్నది డాక్టరు విస్తుపోతూ.

"ఆహా ఒక్క పది సంవత్సరాలలో అనేకం చూశాను నేను. నా కిప్పుడు ముప్ఫయిఅయిదు సంవత్సరాలు. కాని అనుభవాని కేం కొరతలేదు."

"సరిలెండి, ఫరవాలేదు. ఊరకనే మనస్సు పాడుచేసుకోకండి— ప్రశాంతంగా పడుకోండి," అంటూ వెళ్ళిపోయింది డాక్టరు.

మిసెస్ పాణి నవ్వుకుంది. "ప్రశాంతంగా పడుకోండి," అన్న మాటలు మళ్ళీ గొణిగింది. "ఇంక ఎంతో దూరంలేదు— ఆ సమయం ఆసన్నమౌతూంది" అనుకుంది. మళ్ళీ పుస్తకం తెరచింది.

ఈమారు పేజీ పేజీ చదవడం మానేసి అక్కడక్కడా చదవసాగింది.

♦ ♦ ♦ ♦

జూలై 15, 1945. సరిగ్గా మూడు సంవత్సరాలయింది నా పెళ్ళయి. అమృతంమీద నా కిప్పుడు మమత హెచ్చింది. ఆమెలేకుండా ఒక్క_క్షణం గడపాలని ఉండదు. ఆమెను నేను మనసారా ప్రేమించ గలిగాను. అమృతంకూడా ఎన్ను బాగా చూస్తుంది_కాని ఆమె అభిలాషలే నాకంత నచ్చవు. ఎంతసేపూ చీరెలూ నగలూ_సినిమాలు_ఒకటే తిరగడం సమాజాలూ, సభలూ, మీటింగులూ.

"అర్థంలేని అలసట, ఆమె కెవ రెవరో స్నేహితులు. ఆడా మగా అంతా_పార్టీలు, టిఫిన్లు, కాఫీలు. ఒక్క_నాడూ తీరికగా కనబడదు. మనిషి దొరకటమే మహాభాగ్యంఅయిపోయింది. కాని ఆమె స్వేచ్ఛ కడ్డువచ్చే ప్రయత్నం నే నెన్నడూ చేయను.

"నవంబరు 1, 1945. ఈ మధ్య నా వంట్లో నలతగాఉంటూంది. వెన్నులో నొప్పి, ఏదో తెలియని బాధ. ఇప్పటికే ముగ్గురు డాక్టర్లు చూశారు. ఒక్క_డూ పోల్చలేదు.

"డిసెంబరు 15, 1945. ఒంట్లో బాగులేకపోవడం ప్రారంభించి రెండునెలలు కావస్తూంది. కాని సరియైన మందులేదు. నాబాధ ఎవరికీ అర్థంకాదు. డాక్టర్లు లోపం ఏమీ లేదంటారు. నాకు విసుగుపుట్టి డాక్టర్ల దగ్గరకు పోవటం మానేశాను.

"కాని ఇంత వస్తాదుకూ ఈ చిత్రమైన అనారోగ్యమేమిటి? నాకే ఆశ్చర్యంవేస్తూంది. ఇంత కండలుతిరిగిన శరీరం ఇలా వడిలి పోతూంచేమిటి? అనిపిస్తూంది. అద్దంలోచూసుకుంటే నాలో ఏదో తెలియని బలహీనత ప్రవేశించిందని స్పష్టమవుతూంది. ముఖంలో పూర్వంలా ఆ జవం, జీవం, కనబడదేం? నాకు భయంవేస్తూంది. అమృతాని కిదేమీ పట్టదు_ సరికదా, మీ రూరికే భ్రమపడుతున్నారు. మానసికంగా భయ పడుతున్నారు. డాక్టర్లంతా వెర్రివాళ్ళనుకున్నారా? ఏమీలేదని ఎందు కంటారు? అంటుంది. ఏం చేయను?"

♦ ♦ ♦ ♦

మిసెస్ పాణి కళ్ళలో అప్రయత్నంగా నీళ్ళు తిరిగాయి.

♦ ♦ ♦ ♦

"ఏప్రిల్ 4,-1946. గాలి మార్పుకని అమృతం నేనూ కాశ్మీరుకు వచ్చాం. ఇక్కడ ఉన్న మూడునెలలలో అమృతం మళ్ళీ నా మనిషయింది. ఇక్కడ ఆమెకు స్నేహితులు, పార్టీలు, మీటింగులూ లేవు. నేనే సర్వస్వం. ఎప్పుడూ నా దగ్గరే ఉంటుంది. నాకు చాలా హాయి అనిపించిన రోజు లివే అనుకుంటాను. మనస్సు ప్రశాంతంగా ఉంది. కాశ్మీరదేశపు అందాలు- అమృతంలోని వెలుగులు- జీవితపు మాధుర్యమంతా ఇక్కడే ఉంది అనిపింపచేశాయి. కాని వెన్నులో బాధ ఎక్కువవుతూంది. ఏమిటో తెలియని వర్ణించలేని ఒకేబాధ. మరీ భరించలేని బాధకాదు. నిద్ర పడుతూంది. మైనందిన చర్యలన్నీ జరిగిపోతున్నాయి. కాని ఏదో తోచనీయని సన్నని బాధ. అదీ వెన్నులో.

"మే 4, 1946. ఇవాళే కాశ్మీరునుండి తిరిగి వచ్చేశాం. ఇవాళకి విశ్రాంతితీసుకుని రేపు మళ్ళీ డాక్టరుదగ్గరకి వెళ్ళాలి-అమృతంకూడా భయపడుతూంది. ఇదేం ప్రమాదకరమైన వ్యాధికాదు కద! అని...ఏమో! ఎవరు చెప్పగలరు!

మే 8, 1946. మూడురోజులనుండి ఒకటే పరీక్షలు. విసుగు పుట్టించే పరీక్షలు. పదిమందిడాక్టర్లు చూడడమైంది. ఆఖరికి ఈనాటికి తేల్చి చెప్పేశారు.ఇది మరేమీకాదు వెన్నెముకలో కేన్సరు వ్యాపించిందని- ఇప్పటికే రెండు మూడు వెన్నుపూసలకు వ్యాపించేసిందని- మూడు పదులయినా నిండనిజీవితం-కళ్ళకుకన్పిస్తూంది. వస్తాదులాంటిమనిషి-పందెపు గుర్రంలాంటి మనిషి అన్నమాటలు విన్పిస్తున్నాయి. ఆరడుగుల మనిషయితేనేం? ఆజానుబాహు విగ్రహమైతేనేం? అందమైనవ్యక్తి అయితే నేం? వెన్నులేనివాడు కూలిపోక ఏ మవుతాడు?"

◆ ◆ ◆ ◆

మిసెస్ పాణి గభాలున పుస్తకం మూసేసి వెక్కి-వెక్కి ఏడవటం మొదలుపెట్టింది. కొంతసేపు ఏడ్చి బరువైన కనురెప్పలు మూసుకుని గోడవైపుతిరిగి పడుకుంది. ఆమె కనురెప్పల నీలినీడల్లో ఏవో చరిత్రలు కన్పిస్తున్నాయి. అతనికి కేన్సరువచ్చింది. ఆ తరువాత........ఆ తరువాత చరిత్ర తనకు తెలియనిదికాదు—ఆనాటి సంఘటనలు ఆమె మనస్సులో బరువుగా మెదిలాయి—అమృతం తనని పలకరించినట్లయింది. పలక

రించదూ మరి? అమృతాన్ని తాను బాగా, యెరుగును." ఆ తరువాత కథ నేను చెపుతాను విను" అని అమృతం చెపుతూన్నట్లయింది.

"ఆయనని ఆసుపత్రిలో చేర్పించాం–అంతకంటే వేరేమార్గం లేక–తనకేమో ఆశలేనేలేదు. కాని నేను భయపడతానేమో అని "ఫరవాలేదులే తగ్గిపోతుందన్నారు డాక్టరు" అనేవా రాయన. నిజమేనని కొన్నాళ్ళు నమ్మేను నేను ..........

"ఆయనని చూడటానికి రోజూ సాయంత్రము నాలుగుగంటలకి వెళ్ళేదాన్ని. నేను వెళ్ళగానే విషాదంగా ఒకచిరునవ్వు నవ్వేవా రాయన. నేను బరువుగా నిట్టూర్చేదాన్ని. ఆయన బాగుపడతారని నిజమైన ఆశతో చూశాను కొన్నాళ్ళు. నెలలుగడిచాయి. అంతకంతకు ఆయనపరిస్థితి విషమించింది. వ్యాధి అలాఅలా వ్యాపిస్తూంది. వెన్నులో పెద్ద కురుపయింది. అంతతో ఆగలేదు. ఊపిరితిత్తిలోనికి వచ్చిందన్నారు. ఎముకలకుకూడా వ్యాపిస్తూందన్నారు.

"ఆనాటి కానాటికి ఆయన మంచానికంటుకొనిపోయారు. లేవలేరు. కూర్చోలేరు. నవ్వలేరు. ఏడ్వలేరు. అలా మౌనమూర్తిలా మంచంమీద పడుకుని ఏదో ఆలోచిస్తూండేవారు. డాక్టర్లు అరగంటకొక ఇంజక్షను పొడిచేవారు. ఆయన వద్దనేవారుకాదు. ఎందుకనేవారుకాదు. శరీరాన్ని వైద్యుల కప్పగించి మనస్సు నెక్కడో దాచేసి తపస్విలా పడుకునేవారు.

"సాయంత్రం చూడటానికి వెళ్ళటం తప్ప ఉండడానికి వీలులేదన్నారు డాక్టర్లు. ఆయనను డాక్టర్లకూ నర్సులకూ వప్పచెప్పేయడం తప్ప చేయదగిన దేముంది?

"ఆయన మంచానపడి రెండు సంవత్సరాలైపోయింది. తిరిగి లేచే ఆశ లేదు. ఆయన్ని గురించినఆశ పూర్తిగావదులుకున్నాను నేను. మొదట్లో బాధపడ్డాను. ఏడ్చాను. కాని కాలం జరిగేకొలదీ ఆయన్నిగూర్చిన నిరాశ పూర్తిగా విస్తరిల్లింది. కాని అసలు ఆశలనే వదులుకునే వయస్సుకాదు కదా! అణగద్రొక్కబడిన ఆశలు విజృంభించాయి. నాలుగేండ్ల దాంపత్య జీవనం నాలో కోరికలు చెలరేగించి వదిలింది. కోరికల ప్రభావానికి అవకాశాలు తలఒగ్గాయి. నేను తట్టుకోలేకపోయాను.

"ఆయ నెప్పుడూ మరణోన్ముఖుడై ఉండేవారు. మృత్యువు కరుణించదు. జీవితం జయించదు. ఆయనపై జాలితప్ప మరొక భావమేలేని వ్యక్తిత్వం నాలో పేరుకునిపోయింది. ఆ జాలికారణంగానే అప్పుడప్పుడు వెళ్ళి చూసివచ్చేదానిని.

"శారీరకంగా ఎంత బలహీనుడైనా ఆయనలో మనసుకు మాంద్యం లేదు. నాలో వస్తున్న, వచ్చిన మార్పు, తనయెడల నేను చూపే ఉదాసీనత ఆయన గుర్తించకపోలేదు. కాని అసహాయుడు. ఏం చేయగలడు?

"కొలది దినాల్లో శాశ్వతంగా జీవితాన్ని విడిచిపెట్టేస్తారనగా — హీనమైన స్వరంలో ఏదో ఆయాసపడుతూ ఆయన అన్నమాటలు ఇప్పటికీ స్పష్టంగా వినవస్తున్నాయి.

"నువ్విప్పుడిప్పుడు నన్ను చూడటానికికూడా రావటం మానేశావు. నాకు తెలుసు నువ్వెందుకు రావో! ఎందుకు రాలేవో! అది నీ పొరపాటనను. అందుకు నా కేం కోపంలేదుకూడా! నీ కింకా జీవితం చాలా ఉంది. నీ జీవితాన్ని నీకు తోచినరీతిని మలుచుకోవచ్చును. కాని ఒక్కమాట. —

'కొత్తగా కొన్న కారు చెడిపోతే అది బాగుచేదని చీదరపడి దాని నమ్మేసి మరొకటి కొనడం సహజమే కావచ్చును. కాని నీ సర్వస్వం అని నువ్వు నమ్మినమనిషి కేవలం అతని దౌర్భాగ్యంవలన సర్వనాశనం అయిపోతూంటే, ఆ దౌర్భాగ్యుని చీదరించుకుని గాయపరచటం ఏం ధర్మం? కనీసం అతడు ఈ లోకంలో ఉన్నన్నాళ్ళయినా మన్నించలేని నీ బలహీనతకు నేను జాలిపడుతున్నాను. మనిషినికూడా మరచక్రంలా వాడుకొని పనికిరానిసమయంలో పరాయివస్తువుగా పారవేసుకునే నీ మనస్తత్వానికి కొంచెం ఔదార్యం తెచ్చిపెట్టుకోమని అర్థిస్తున్నాను."

"ఆయనమాటలకు నేను చాలా భయపడ్డాను. చాలా బాధపడ్డాను. వెక్కివెక్కి ఆయనముందే ఏడ్చేశాను. ఆయన మళ్ళీ అన్నారు. 'ఏడ్చి ప్రయోజనంలేదు. జీవితాన్ని ఆనందమయంచేసుకోడానికే ప్రయత్నించు. చూడూ! నా ఆస్తినంతా నీ పేర వ్రాశాను, ఒక ఇరవైవేలు తప్ప.

కేన్సరుకు ప్రత్యేకం ఆసుపత్రి నిర్మిస్తున్నారట. నీ పేరుమీదుగా ఒక వార్డు కట్టమని ఇరవైవేలు దానంచేస్తున్నాను.'

"నేను తుళ్ళిపడి వెర్రికేక వేశాను. 'నా పేరుమీదుగానా!' అని,

'అవును నీ పేరుమీదుగానే - నా పేరు ఎక్కడా శాశ్వతంగా నిలవటం నా కిష్టంలేదు—— పరాక్కా చిన్నకోరిక. ఇదిగో ఈ పుస్తకం నీదగ్గరుంచు. ఎప్పుడయినా తీరికయితే చదువుకో! అంతే.'

* * * *

"ఇప్పుడే తీరికయిందా పుస్తకం చదవటానికి" అనుకుంది. ఇప్పటి మిసెస్ పాణి—కాదు కాదు—ఒకనాటి మిసెస్ రంగనాథం. అతని అంతిమఘడియల చరిత్రను అంతవరకూ వల్లెవేసుకుని—ఆమెకు ఊపిరి సలుపనట్లయింది. పక్కమీద వేదనగా అటూ యిటూ పొర్లాడింది. తల గడాకింద తలదూర్చి ఏడ్చింది. మళ్ళీ మళ్ళీ ఏడ్చింది.

"మిసెస్ పాణీ! మిస్టర్ పాణి మళ్ళీ ఫోన్ చేశారు," అన్న సిస్టర్ కంఠంవిని ఆమె తలయెత్తింది.

"ఈ దినం రావటానికి వీలవదట. ఆయనకు డాన్సింగ్ పార్టీ ఉందట. వీలయితే రేపు వస్తానన్నారు," అనేసి వెళ్ళిపోయింది సిస్టర్.

స్పెషల్ రూములో స్తంభించిన వాతావరణం మిసెస్ పాణి పెద్ద నిట్టూర్పుతో కదిలిపోయినట్లయింది. ఆమె వెర్రిదానిలా అరిచింది "ఎందుకు వస్తారూ! ఇకమీద రారు!" అని.

* * * *

ఈమధ్యనే పేపర్లో పడింది! "మిసెస్ పాణి అనే ధనవంతురాలు కేన్సరు లంగుతో బాధపడి చనిపోయింది. చనిపోయేముందు ఆమెపేర నున్న ఆస్తినంతటినీ ఆమె మొదటి భర్త అయిన కీ॥ శే॥ రంగనాథం గారి పేర ఆసుపత్రికి దానంచేశారు. రంగనాథం మెమోరియల్ వార్డుకు త్వరలోనే శంకుస్థాపన జరుగుతుంది," అని.

—:o:—

# సుందరీ - సుబ్బారావు

బాలగంగాధర తిలక్

సెకండరీగ్రేడు మేష్టారు సుబ్బారావుకి పాపం తీరుబడిలేదు.

అతనికి కాలం చాలా ఇరుకుగావుంది. ఇరుకుగా ఇటూ అటూ ఊచలతో కట్టిన బోనులాగా 'కారిడర్'లాగా వుంది,

అతని వెడల్పాటి ఆశయాలు సరదాగా ఇటూ అటూ పచార్లు చేయడానికి వీలులేకుండా వుంది.

ఇరవైనాలుగేళ్ల సుబ్బారావు ముంగురులమీదనుంచి కలలు జారుతుంటాయి, కృష్ణశాస్త్రి చెప్పినట్లు, కృష్ణశాస్త్రిగారు అతన్నిగురించి చెప్పలేదనుకోండి. అయితే సుబ్బారావుకి ఎందుకు తీరుబడిలేదు?

అతనులేచిన కాస్సేపట్లో స్నానానికి వెళతాడా! అక్కడ నూతిగట్టుమీద తువ్వాలుకట్టుకుని చేదమీద చేద తీసుకుని నీళ్ళుపోసుకుంటూంటే నీటిబిందువులు ముత్యాల్లా ఎర్రని వొంటిమీదనుండి జారతాయి. ఉదయసూర్యుడి చిరువెచ్చని కాంతిలో మెరుస్తాయి. రోజూ పాలుపోసే గొల్లపిల్ల మాత్రం రెప్పవాల్చకుండా ఆశగా తన వొంటకేసి చూస్తుందని సుబ్బారావుకి తెలియకపోలేదు. కాని వుత్తి గొల్లపిల్లలు మాసిన బట్టలతో, ఆశలతో అందంగా లేని గొల్లపిల్లలు తనకథలో నాయికలుగా వుండడానికి అంగీకరించలేడు సుబ్బారావు.

సబ్బుతీసి వొళ్ళుతోముకుంటూంటే సుబ్బారావుకి ఆ స్పర్శ—తన ఛాతీమీద జబ్బలలోని పిక్కలలోని కండలయొక్క స్పర్శ—ఏదో గర్వాన్నీ హాయినీ కలిగిస్తుంది. ఇంత భౌతికంగా, వాస్తవంగా ప్రత్యక్షమవుతున్న ఆ బలాన్నీ, యౌవనాన్నీ చూసుకుని మురిసిపోకుండా ఉండలేకపోతున్నాడు సుబ్బారావు.

అలాగ గర్వపడనివాడు పత్తి ఆధ్యాత్మికవాది. సుబ్బారావుకి ఆధ్యాత్మికవాదులంటే అంత నమ్మకంలేదు.

చక్కగా కమ్మెచ్చు తీసినట్లు—సంస్కృత కవులు వర్ణించిన దేహయష్టిలాగ, హాలీవుడ్ రోనాల్డ్ కోల్మన్‌లాగ, సింహకిశోరంలాగ బలిష్టంగా పసందుగా వున్న దేహాయిరలవాళ్లని-ఒకళ్లని చూపెడుదూ!

ఉహుఁ—పదిమైళ్ళ రేడియస్‌లో ఎక్కడా కనపడడు.

అన్నాడు, అనుకున్నాడు సుబ్బారావు. అయితే ఇటువంటి గాత్రం కలిగివున్నవాడికి ఉండవల్సిన ప్రోస్పెక్ట్స్ ఏఁవిటీ!

ఇలాగ ఒక గంటఅయినా ఆలోచిస్తూ, నూతిలో సగం నీళ్ల పోసేసుకుంటూ వున్న సుబ్బారావుకి వాళ్ల అమ్మపిలుపుగాని, చెల్లెలు కేకగాని వినిపించేటప్పటికి తెలివి వొచ్చి వొళ్ళుతుడుచుకుని తను అద్దెకున్న తన వాటాలోకి వెళతాడు. వాటాలో మొదట వంటగదిలోంచి రెండవగదీ, ఆఖరుగదీ అయిన పడకగదిలోకి వెళ్ళాలి.

పడక గదినే చదువులగది అనవచ్చును. దాన్నే డ్రాయింగ్‌రూమ్ అన్నా సుబ్బారావుకి ఏమీ అభ్యంతరం లేదు.

మొదటిదైన వంటగది దాటుతూంటే వాళ్ళమ్మ 'ఒరే సుబ్బా! మెంతులూ, ఆవాలూ అయిపోయాయిరా. స్కూలునుంచి వొచ్చేటప్పుడు పట్టుకురా నాయనా," అంటుంది.

'ఓ, అలాగే,' అంటూ రెండవగదిలోకి వెళతాడు. అక్కడ చెల్లెలు ఓమూల కూర్చుని బుద్ధిమంతురాలిలాగా సాంఘికశాస్త్రం చదువు తూంటుంది.

సుబ్బారావు నవ్వుతాడు. ఎందుకంటే ఆ పుస్తకంపేజీలమధ్య సినీమాపాటలపుస్తకంకూడా ఉంటుందిగా. అయితే సుబ్బారావు తెలీ నట్టుగా ఉంటాడు. డిప్లమసీ అంటారే, అదికూడా సుబ్బారావుకి తెలియక పోలేదు.

ఆ గదిలో ఓ బల్లవుంది. ఆ బల్లముందు ఓ కుర్చీవుంది. ఆ కుర్చీలో కూర్చుంటాడు సుబ్బారావు. బల్లమీద ఒకఅద్దం గోడకి దాపెట్టిఉంటుంది. అద్దంఅంటే అంతాకాదు; అసలు అద్దంలో మూడూ బై అయిదవవంతు. ఆమధ్య అద్దం కిందపడినప్పుడు తక్కిన రెండూ బై అయిదవవంతు అసలునుంచి బలవద్వియోగం పొంది విడిపోయింది.

ఈ అద్దంలో చూసుకుంటూ సుబ్బారావు మళ్ళీ ఒకగంట ఆలో చించుకుంటాడు. అద్దంలో అతని మొహం — మూడూ బై అయిదవవంతు

మొహం—కనపడుతుంది. ఆ పరిమాణంలో తన కళ్ళూ. జుట్టూ, ముక్కూ, పెదాలూ, పెదాలమీద అందమైన సన్నని చిన్నని మీసకట్టూ చూసుకుంటాడు. అలాగ చూసుకుంటూ ఆలోచించుకుంటాడు.

ఏమనీ—?

అదిగో, అక్కడే అతని ఆలోచన తారాజువ్వలా దూసుకు పోతుంది. విచిత్రమైన గగనాల్ని తాకుతుంది. నక్షత్రాల్ని 'హలో' అని పలకరిస్తుంది, ఇంకా పైపైన ఏయే విచిత్ర స్వప్నగోళాలు ఉన్నాయో అని గవేషిస్తూ, పర్యవేషిస్తూ వెళ్ళిపోతుంది పైపైకి.

తనకున్న పెర్సనాలిటీకి ఒక యూరోపియన్ కంపెనీ యజమాని కనీసం వెయ్యిరూపాయలజీతంమీద మాంచి ఉద్యోగం ఒకటి ఎందు కివ్వకూడదూ! ఏం, ఎందుకు యివ్వకూడదూ! అసలు మొదట రాక్ ఫెల్లర్ ఎవడు? ఫోర్డు ఎవడు?

బొంబాయిలోనూ, మద్రాసులోనూ, యిళ్ళకన్న స్టూడియోలు ఎక్కువై పోయాయిట. అందులోనూ కొత్త మొహాలకోసం ప్రొడ్యూ సర్లూ, డైరెక్టర్లూ ఒకటే గోలపెడుతున్నారట. మరి తనకున్న కట్టూ గెయిటూతో (కట్ అండ్ గెయిట్)—చటుక్కున ఓ ఛాన్సు తగిలి హీరోఅయిపోతే—?

అసలు అంతదూరంవరకూ ఎందుకూ. మిల్లుఓనర్ ప్రకాశరావు కూతురు—తను స్కూలునుంచి వస్తుంటే కారు వయ్యారంగా డ్రైవ్ చేసుకుంటూ ఎదురువస్తుందికదా. చలాకీగా అందంగా ఫ్యాషన్‌గా ఉంటుంది. ఎర్రని పెదవులమీదకి రాబోయే నవ్వు దారితప్పి అలా బుగ్గల మీదకి వెళ్ళబోయి సరాసరి కళ్ళల్లోకి వెళ్ళి కూర్చుంటుంది. బలే అందంగావుంటుంది సుమిత్ర! ఒకరోజున కార్లో వెళుతూవెళుతూ తన్ని చూసి, నిదానంగా యింకోమారు చూసి, స్టన్‌అయి, ఉక్కిరిబిక్కిరై 'ఓహో ఎవ రీ కుర్రవాడు, ఇతనికి నా హృదయం యిచ్చేశాను. ఇతనే నా మొగుడు. ఈ నిశ్చయమూ, నిర్ణయమూ మారదు' అని గట్టిగా అనేసుకుంటే-ఏమో ఎవరికి తెలుసూ!

ఇలాంటివన్నీ ఆలోచించుకుంటాడు. అందుకే అతనికి బొత్తిగా తీరికఉండదు.

ఒకటి: పరికిణీలు చిరిగిపోయాయి. కుట్టించరా అన్నయ్యా.

రెండు: రెండు వోణీలుకూడా కొనేం- మరచిపోకు.

మూడు: అన్నట్టు పాలవాడు సొమ్ముకోసం నిలతీస్తున్నాడురా అబ్బాయి. వాడికి చాలా అవసరంట!

నాలుగు: ఏమండోయ్ సుబ్బారావుగారూ, మీరు అలాగ సంగీతం పాడేస్తూంటే మా పిల్లలు చదువుకోవాలా అక్కర్లేదా - స్వంతయిల్లు అనుకున్నారేం విటీ!

అయిదు: ఒరేయ్ సుబ్బారావు. అడక్కడక్క అడిగావ్. పాపం. అయిదురూపాయలు కాదుకదా, అర్ధరూపాయి కూడా లేదురా, నీతోడు.

ఆరు: సైకిల్ కి లైటు లేదేం. నీ పేరు? పని? ఊరు? రేపు పదింటికి కోర్టుకి రా.

ఏడు: ఏయ్ హారన్ వాయిస్తూంటే తప్పుకోవాలని తెలియదూ? నడుస్తూనే నిద్రపోతున్నావా?

ఎనిమిది: చిరంజీవి సుబ్బారావుకి: ఈ నెల జీతాలు మాకు అందలేదు. మీ అత్తయ్యకి వారంరోజుల్నించీ జ్వరం. ఒక్క యిరవై రూపాయలుంటే అర్జంటుగా పంపించవల్సింది. జరూరు.

తొమ్మిది: ఈ షర్టింగు గజం అయిదు రూపాయలు. ఏం అలా చూస్తావేం. బట్టలన్నీ తీయించి కుప్పవేయించావ్. కొనే మొహమే! తెలుస్తూనేఉంది.

పది: ఏమోయ్ సుబ్బారావ్. స్కూలువదలగానే ఒకసారి యింటికి రా. రేపు మా యింట్లో సత్యనారాయణవ్రతం చేసుకుంటున్నాం. కొంచెం మార్కెటింగ్ చేసిపెడుదువుగాని, నీకు సరుకునాణెం తెలిసినట్టు యింకెవరికీ తెలియదంటుంది మా ఆవిడ - ఇది కుర్చీలో కూర్చున్న హెడ్మాష్టర్ అభిధగల ఒక స్థూలకాయంతాలూకు ఆస్య వివరంనుంచి వచ్చిన ఆజ్ఞ!

ఇలాంటివి గొప్పులు, ముళ్లు, డొంకలు, రాళ్ళు, గాజుపెంకులు, గోతులు, తేలుకాట్లు, మంద్రగబ్బలు అడుగడుగునా మలుపుమలుపునా తగులుతూన్నా సుబ్బారావు నిస్పృహచెందలేదు.

చాలా బాధపడుతుంది అనుకున్నాడు? ఆమెతో మాట్లాడేటప్పుడు జాగ్రత్తగాఉండాలని తీర్మానించుకున్నాడు.

సుహాసినివెళ్ళిన కొద్దినిమిషాలకే శ్రీపతీ, ప్రకాశం వచ్చారు. శ్రీపతి ఆ ఆఫీసులోనే మరొకశాఖకి అధిపతి. ప్రకాశం అతనిని మూర్తికి పరిచయంచేసి, ఏదో పనివుందని వెళ్ళిపోయాడు. కాసేపు పిచ్చాపాటి మాట్లాడారు.

"పూల్ చంద్ వచ్చాడా మీదగ్గిరికి?" అన్నాడు శ్రీపతి అకస్మాత్తుగా, యథాలాపంగా అన్నట్టు.

"పూల్‌చం దెవరు?" అన్నాడు మూర్తి అర్థంకాక.

"మిల్లుయజమానండీ. రానేలేదన్నమాట."

"నాదగ్గిర కెవరూ రాలేదు. ఏమిటి పని?."

"ఆఁ నిన్న నాదగ్గిరకి వచ్చాడులెండి. మీ రింకా అతనికి పరిచయం కాలేదుగా. పరిచయంచెయ్యమన్నాడు. ఎందుకయ్యా! ఈమాత్రందానికి నువ్వేవెళ్ళి అడిగితేపోతుంది అన్నాను."

"ఏం కావాలిట ?" అన్నాడు మూర్తి ఉపోద్ఘాతం ఎందుకో తెలియక.

"పర్మిట్. మరేంకావాలి అతనికి. ఏదో చూసి పంపండి. బాగా ఉన్నవాడే. బాగానే ఛార్జిచెయ్యవచ్చు."

"ఛార్జి చెయ్యడమేమిటి ?"

శ్రీపతి అపనమ్మకంతో మూర్తికళ్ళలోకి చూశాడు.

"ఏమిటండీ అలా మాట్లాడతారు ? రోజుకి మూడు నాలుగొందలకి తక్కువకాకుండా వచ్చే సీటులో కూర్చుని," అన్నాడు మందలించే స్వరంతో శ్రీపతి.

ఈసారి అపనమ్మకంతో చూడటం మూర్తివంతయింది.

"లంచమా ?" అన్నాడు ఆశ్చర్యంతో కళ్లు పెద్దవిచేసి మూర్తి.

"ప్రతిఫలం," అన్నాడు అదేంమాట అన్నధోరణిలో శ్రీపతి.

"ఛీ," అన్నాడు ఏవగింపుతో మూర్తి.

శ్రీపతి కొంచెం చిన్నబోయాడు.

"కబుర్లు చెప్పకండి. ఎవరికీ ఏమీ నష్టంలేనిపని చేసి అందుకు

ప్రతిఫలం తీసుకుంటే ఏమిటి చెప్పిర ? జీవితం సాగాలా ? వొద్దా ? మడి గట్టుకు కూచోవాలంటే కుదరదండీ మూర్తిగారూ !"

చిన్న ఉపన్యాసం ఇచ్చాడు శ్రీపతి.

"అలాంటిపని నేను చెయ్యనండీ," అన్నాడు మూర్తి నిష్కర్షగా.

"మీ ఒక్కరూ నీతిగాఉంటే ఏమౌతుంది? ఆ మాటకొస్తే 'నీతి' అనేదేమిటో నిర్వచించండి. చాలీచాలని జీతాలిచ్చి, హోదాకి తగ్గట్టుగా బతకమంటే ఎలా ? కుటుంబం ఏంకావాలి ? రేపు మనపిల్లలు చదువు కోటానికి డబ్బులేక అవస్థపడుతూ ఏ బండచాకిరీనో చేసుకొని బతు కుతూ ఉంటే 'నీతి' పేరు చెప్పుకుని మనం సంతోషిస్తూ కూచోవాలా ? కబుర్లు చెప్పకండి." అన్నాడు శ్రీపతి ఉద్రేకంగా.

మూర్తి ఏమీ మాట్లాడలేదు. ఇంకేం మాట్లాడినా శ్రీపతి ఉపన్యా సం మరింత పొడుగౌతుందని అతనికి తెలుసు. శ్రీపతి సమాధానంకోసం కొంచెంసేపాగి, విసుగుదలసూచించే స్వరంతో అన్నాడు.

"చెప్పాలిసింది చెప్పాను, మీ ఇష్టం."

అప్పటికీ మూర్తి ఏమీ అనలేదు. శ్రీపతిఅహం కొంచెం దెబ్బ తింది. వెళ్లిపోయాడు. ఈ విషయం ఇంతటితోసరి అనుకున్నాడు మూర్తి. కాని తను పొరబడ్డట్టు ఆ సాయంత్రమే తెలుసుకున్నాడు. శ్రీపతి ఆ ఫూల్‌చంద్ అనేఆయనతోసహా అతనిబసకి వచ్చాడు. వాళ్ళిద్దర్నీ చూడగానే మూర్తికి మొదట కోపమూ, తర్వాత ఏహ్యభావమూ కలిగాయి.

మర్యాదకోసం ఇద్దర్నీఆహ్వానించి కూర్చోబెట్టాడు. శ్రీపతి మళ్ళీ విషయం కదలేశాడు. ఫూల్‌చంద్ మధ్యమధ్య రేటుపెంచుతూ కలగ జేసుకున్నాడు. దాంతో మూర్తికి అపరిమితమైన అసహ్యంకలిగింది. కాని తమాయించుకున్నాడు.

మూర్తిమొండిపట్టుదల చూచి ఫూల్‌చంద్‌ని వెళ్ళమన్నట్టు సంజ్ఞ చేశాడు శ్రీపతి. ఫూల్‌చంద్ మూర్తిని మళ్ళీ ఒకసారి ప్రార్థించి శెలవు తీసుకున్నాడు.

"ఆఫీసువిషయాలు మీకు బాగా తెలియవు." అన్నాడు శ్రీపతి.

ముభావంగా ఊరుకున్నాడు మూర్తి.

"మహేంద్రరావూ, రామదాసూ, నారాయణాకూడా మొదట ఇలాగే అన్నారు. రానురాను కుటుంబంభారం మీదపడటంతో తెలిసివచ్చింది. మీ శ్రేయస్సు కోరి చెబుతున్నాను. లేకపోతే ఇలా మీ ఇంటికికూడా వచ్చి నచ్చచెప్పేఅవసరం నా కేమిటి? ఆలోచించుకోండి." అని శ్రీపతి వెళ్ళిపోయాడు.

మూర్తికి తలదిమ్మెక్కింది. శ్రీపతిమీద కోపంతోపాటు అసహ్యంకలిగింది. కాని కొంచం ఆలోచించేసరికి అతనిమీద అసహ్యం తగ్గింది. తోటిఉద్యోగి కనుక అతనికి తోచింది చెప్పాడు. ఆలోచించి కర్తవ్యం నిశ్చయించుకోవలసింది తను. ఇలా అనుకొని మనస్సు సరి పెట్టుకున్నాడు. ఇంతలో ప్రకాశం వచ్చాడు.

"వచ్చిరాగానే కుర్చీలోంచి ఏదో తీసి పరీక్షించి మూర్తివైపు గిరవాటేసి అడిగాడు.

"ఏమిటది?"

"నోట్లకట్ట"

మూర్తి దిగ్భ్రాంతుడయ్యాడు. "ఏమిటీ దొంగపని? ఎందుకీ బలవంతం?"

"ఆ శ్రీపతీ, ఫూల్‌చందూ కలిసి చేసినపని. రేపుపొద్దున వాళ్ళ మొహాలమీద కొట్టివస్తాను" అన్నాడు మూర్తి ఉద్రేకంగా.

ప్రకాశం నవ్వాడు.

"పిచ్చివాడా! సిరి రా మోకాలొడ్డటం అంటే ఇదే!"

మూర్తి తలపట్టుకున్నాడు.

"మీకు పుణ్యంఉంటుంది. ఆ డబ్బు తీసుకోమని నాకు చెప్ప వద్దు," అన్నాడు.

"పోనీ. నేను తీసుకోనా?" అన్నాడు ప్రకాశం వెటకారంగా.

వెయ్యిముఖాలు తనని వెక్కిరిస్తున్నట్టుగా అనుభూతి పొందాడు మూర్తి. అదే క్షణంలో శ్రీపతి మళ్ళీ వచ్చాడు.

"ఫూల్‌చంద్ డబ్బు ఇక్కడ మర్చిపోయివెళ్ళాడట. ఇప్పుడే కనిపించి చెప్పాడు. మీ దగ్గరే ఉంచండి. అంత అక్కర్లేకపోతే రేపివ్వచ్చు," అన్నాడు.

"అక్కర్లేదు. క్షమించి ఇప్పుడే తీసుకు వెళ్ళండి," అన్నాడు మూర్తి. శ్రీపతి డబ్బు తీసుకుని, మరేమీ అనకుండా విసురుగా వెళ్ళిపోయాడు.

"నేను లంచం తీసుకోకపోతే ఆయన కెందుకు కోపం?" అన్నాడు మూర్తి.

"మీరు సిగరెట్ తాగకపోతే నా కెందుకు కోపం?" అన్నాడు హాస్యధోరణిలో ప్రకాశం. మూర్తి పూర్తాడకపోయేసరికి అతని కోపం తగ్గించటానికి మళ్ళీ ప్రకాశం అన్నాడు. "శ్రీపతి మీద అంత కోపం దేనికి?"

"ఆయనమీద కాదు. ఆయన చేసిన పనిమీద"

"ఆయన చేసిన పని మంచిదికాదా?"

"ముమ్మాటికీ కాదు."

"ఎందుకు కాదు?"

"మీకు తెలుసు."

"మీకు తెలిసినట్టుగా నాకు తెలియకపోవచ్చు. ఆ మాటకొస్తే ఏ విషయమూ ఒకరికి తెలిసినట్టుగా మరొకరికి తెలియదు. మన అభిరుచులకి అనుగుణంగా అభిప్రాయాలు ఏర్పడుతూ ఉంటాయి. ఆ దృష్టికోణంలోంచి ఇతరుల చేష్టల్ని విమర్శించటం మంచిదికాదేమో. అలా అని లంచంతీసుకోటం సమర్థిస్తున్నానని కాదు. నిజానికి నేను లంచం ఇంతవరకు పట్టి ఎరగను. శ్రీపతి సర్వవిధాల చెప్పాడు. అయితే అందుకు నే నతన్ని నిందించలేదు. ఆతనిమీద కోపమూలేదు. మీ కేదో నేను నీతి బోధచేసిఉంటానని ఆతనినమ్మకం. మాటల్లో బయటపడ్డాడు. సరే ఈ చర్చ అనవసరం. అలా క్లబ్బుకి వెళ్ళొద్దాం పదండి." అన్నాడు ప్రకాశం.

మూర్తి ప్రశాంతంగా విని ఊరుకున్నాడు. అదే క్షణంలో రామదాసు వచ్చాడు. వస్తూనే ప్రకాశంమీద అభాండం వేశాడు.

"నీ క్లబ్బు వ్యసనం మూర్తిగారికికూడా అంటించావా?"

"రామ రామ" అన్నాడు ప్రకాశం.

"సంతోషం," అన్నాడు రామదాసు.

"రాములవారి గుడికేనా ప్రయాణం?" అన్నాడు ప్రకాశం.

"కాదు, క్లబ్బుకి!" అన్నాడు వెటకారంగా రామదాసు.

"కూర్చోండి, రామదాసుగారూ." అన్నాడు మూర్తి తేరుకుని.

"మూర్తిగారూ, ఇవాళ మీరు క్లబ్బుమానేయాలి. అలా ఊరి బయటికి షికారువెళ్దాం." అన్నాడు రామదాసు.

"గుళ్ళోకి వెళ్ళొద్దామని చెప్పరాదూ? డొంకతిరుగుడుదేనికి?" అన్నాడు ప్రకాశం.

"ఏం, గుళ్ళోకి వెడితే పాపమా?" అన్నాడు రామదాసు.

"రామ రామ. ఆ మాట నే నన్నానా?"

"మరయితే పదండి, ఆలస్యమెందుకు?"

"నన్ను విడిచిపెట్టండి. క్లబ్బులో పదిమందిపెట్టు నే నొక్కడినీ. గోలపెడతారు" అన్నాడు ప్రకాశం.

"సరే నీ ఇష్టం. రండి మూర్తిగారూ, అలా వాటర్‌వర్క్స్ దాకా వెళ్ళొద్దాం." అన్నాడు రామదాసు.

నిజానికి మూర్తికి క్లబ్బు ముఖంమొత్తింది. ప్రకాశం బలవంతం మీద వెళ్ళటమేగాని అందులో అతనికి ఆసక్తిలేదు. అందువల్ల రామదాసుతో బయల్దేరాడు. రామదాసు అసలుపేరు రామచంద్రరావు. కాని ఆఫీస్‌లో అందరూ అతన్ని రామదాసుగా మార్చేశారు.

వాటర్‌వర్క్స్ చెరువులదగ్గర కాసేపుకూర్చుని సంజవేళ ఇంటికి మళ్ళారు ఇద్దరూ. దారిలోనే గుడి. అందాకావచ్చి "లోపలికివెళ్ళొద్దామా?" అన్నాడు రామదాసు, సరేనన్నాడు మూర్తి. రామదాసు రెండు కొబ్బరి కాయలు కొనబోయాడు,

"ఒకటి చాల్లెండి," అన్నాడు మూర్తి.

"అదేం, మీరు కొట్టరా?" అన్నాడు రామదాసు కొంచెం ఆశ్చర్యంగా.

"ఎందుకులెండి" అన్నాడు మూర్తి.

"మీకు భక్తిలేదా?"

"ఆ విషయాలు అడక్కండి?"

"ఎందుకని?"

"వాటినిగురించి నేనంత ఎక్కువగా ఆలోచించలేదు."

"ఆలోచించవలసిన విషయాలు అంతకంటె ఏం ఉన్నాయండి ?"

"ఎందుకు లేవు ? బోలెడన్ని ఈతిబాధలు."

"వాటినిగురించి ఆలోచించేదేమిటి ? ఎప్పు డేది అవసరమైతే అప్పటికప్పుడు ఏదో చేసెయ్యటమే."

"అయితే ఆలోచించకుండానే ఈ మహానుభావుడు లంచంతీసు కుంటున్నాడా ?" అనుకున్నాడు మూర్తి. వెంటనే అతనికి రామదాసు మీద కొంచెం అసహ్యంకూడా కలిగింది. జనంలోతిరుగుతూ జనాన్ని మోసగించే ఈయనకి భక్తిలో అంతవిశ్వాసం ఎందుకో ! చేసినపాపాల్ని దేవుడు క్షమిస్తాడనా ? ఈ ఆలోచనరాగానే రామదాసుని దెబ్బకొట్టాలని పించింది మూర్తికి.

"చేసిన పాపాలకి ప్రతిసాయంత్రం లెక్కచెప్పి శిక్షతగ్గించ టానికి లంచంఇవ్వటమేగా కొబ్బరికాయ కొట్టటమంటే" అన్నాడు.

రామదాసు అప్రతిభుడయాడు. అతని ముఖంలోని మార్పుని గమ నించి మూర్తికూడా పశ్చాత్తాపపడ్డాడు. అంత కటువుగా అనాలని అన లేదు తను. కాని సమయం మించిపోయింది. అనేశాడు.

"ఈ మాటలు మీకే తోచాయా? ఎవరైనా చెప్పారా?"

"ఒకరు చెప్పేందు కేముందిలెండి ఇందులో!" అన్నాడు మూర్తి సర్దుకుంటూ.

"అదికాదు. మీరు చెప్పింది కొందరిపట్ల నిజంకావచ్చు. కానీ అందరూ అలాంటివారుకారు. కనీసం నేనలా ఎప్పుడూ అనుకోలేదు. నేనూ పాపాలుచేశాను. ఎవ్వరిగొంతూ కొయ్యకపోయినా, పాపాలన బడేవి చేశాను. ఆమాటకొస్తే పాపం, ఏదోవిధమైన పాపంచెయ్యని దెవరు? కాని వాటికి ప్రాయశ్చిత్తంకోసం నేను గుడికిరావటంలేదు. మనిషి జీవితం బహుముఖమైందికదా. ఆధ్యాత్మిక చింతనకోసం నేను దైవాన్ని ఆరాధిస్తాను. మీరు దేవుడున్నాడని ఒప్పుకోరా?"

రామదాసు మాటల్లోని నిజం అవగతమైనా మూర్తివెంటనే ఓట మిని ఒప్పుకోలేదు. పైగా అతను మామూలు ప్రశ్న ఒకటి వేసేసరికి అతనిలోని తార్కికశక్తిని రెచ్చగొట్టినట్టయింది.

"ఒప్పుకోనని చెప్పలేదే," అన్నాడు.

"అయితే ఒప్పుకుంటారన్నమాట."

"ఒప్పుకుంటానని చెప్పలేదే?"

విస్తుబోయాడు రామదాసు.

"అయితే మీ రనేదేమిటి?"

"ఏమీలేదు. నా కేవిషయాలు తెలియవని చెప్పాను. దేవుడున్నాడని నాకు రుజువైతే ఒప్పుకుంటాను. రుజువుకాకపోతే తటస్థంగాఉంటాను." అన్నాడు మూర్తి.

"మీరు రోజూ నాతో గుడికివస్తానని మాటఇవ్వండి." అన్నాడు రామదాసు హఠాత్తుగా.

"ఎందుకు?"

"మాటివ్వండి."

"క్షమించాలి."

"మీ మేలుకోరే చెబుతున్నాను."

"కృతజ్ఞుణ్ణి."

"సంశయాత్మా వినశ్యతి"

"కానివ్వండి. ఏంచేస్తాం?"

"మీకోసం నేను ఇవ్వాళనుంచీ రోజూ ఒకఅరగంట దైవాన్ని ప్రార్థిస్తాను."

మూర్తి చలించాడు. రామదాసు రెండు కొబ్బరికాయలుకొని గుళ్లోకి మూర్తితోసహా వెళ్ళాడు. రెండు కొబ్బరికాయలూ తనతరఫునా, మూర్తి తరఫునా తనే కొట్టాడు. నమస్కారంచేశాడు. మూర్తిని నమస్కారం చెయ్యమన్నాడు.

"మీకు నమస్కారంచేస్తానుగాని, ఎవరో ఊహించుకొన్న బొమ్మకి నమస్కారంచేస్తే ఏం లాభం?" అన్నాడు మూర్తి, రామదాసు ఊరుకున్నాడు.

"రోజూ నాతో గుడికివస్తారుకదూ?" గుడిప్రాంగణం దాటుతూ అన్నాడు రామదాసు.

"రాకూడదని నా కేమీ లేదు. రావాలనీ లేదు."

"పోనీ ఇలా షికారుగా వద్దాం. ఇష్టమైతే గుళ్ళోకి వెళ్ళవచ్చు, లేకపోతే లేదు."

మూర్తికి నవ్వొచ్చింది. ఈ మనిషి కెందు కింత తాపత్రయం? చూస్తే తనని ఈ భక్తిమార్గాన పట్టించేదాకా వదిలేట్టులేడు. ఏవో సాకులుచెప్పి వదిలించుకోవాలని నిశ్చయించుకున్నాడు మూర్తి.

ఇంటికి వచ్చేసరికి బాగా పొద్దుపోయింది. హోటల్‌నించి క్యారియర్‌వచ్చిఉంది. ప్రకాశం అప్పటికే భోజనంముగించుకుని ఉన్నాడు.

"ఏం, ఇవాళ అప్పుడే క్లబ్బునించి వచ్చేశారు!"

"పౌర్ణమికదూ, అలా ఊరిబయటికి కులాసాగా షికారుకి వెళ్ళొద్దాం, త్వరగా భోజనంకానివ్వండి."

మూర్తి తన గదిలోకి వెళ్ళి భోజనంముగించుకొని బయటికివచ్చే సరికి ప్రకాశం తెల్లటి గ్లాస్కో-పంచె, గ్లాస్కో-లాల్చీ వేసుకుని కిల్లీ నముల్తూ పూలరంగడిలా కనిపించేడు.

"షికారుకా, అత్తవారింటికా?" అన్నాడు మూర్తి నవ్వుతూ.

ప్రకాశం మాట్లాడలేదు. చిన్నగా నవ్వాడు. ఇద్దరూ వెన్నెల్లో నడుస్తూ ఊరిబయటికి చేరుకున్నారు.

"ఇటు కొంతదూరం పోతే ఏరు వస్తుంది." అన్నాడు ప్రకాశం.

"పోదామా?" అన్నాడు మూర్తి ఉత్సాహంగా.

"ఎందుకు? ఏముంటుంది అక్కడ?" అన్నాడు, ప్రకాశం చిరునవ్వుతో.

"వెన్నెల్లో ఏరు పొంగి పొర్లుతూఉంటే చూడముచ్చటగా ఉంటుంది కదా!"

"యవ్వనంలా," అన్నాడు ప్రకాశం.

"బాగా పోల్చారు."

"పోల్చటంలో ఏం ఉంది? అనుభవించాలి."

మూర్తికి ప్రకాశంఉద్దేశం బోధపడక మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"నేను బాగా పోల్చానని ఎందుకన్నారు?"

"ఉపమానం సరిపోయిందని నా భావం."

"యవ్వనం ఉరకలు వేసేవారి కది స్వానుభవం. విచ్చలవిడిగా సంచరించే ఏరుని ఇప్పుడు మీ రర్థంచేసుకోగలరుకదూ?"

మూర్తి కర్థమైంది.

"గట్లని ఒరుసుకునే కదా ఏరు ప్రవహించేది!" అన్నాడు నర్మ గర్భితంగా.

"ఉత్సాహపు వెల్లువలో గట్లు దాటిపోదా ప్రవాహం?"

"గట్లకి లోబడి ఉరకలు వేసేటప్పుడే ఏటిఅందం. విలయంలో అందమేమిటి?"

ప్రకాశం ఒక్క క్షణం ఊరుకున్నాడు.

"మీకు వెన్నెల్నిగురించీ, అందాన్నిగురించీ తెలుసుకోవాలని లేదా? ఉంటే అన్వేషించండి. మనస్సుని ఊరికే అడ్డుప్రశ్నలతో బాధిస్తే మిగిలేది తలనొప్పే."

మూర్తికి జవాబేమివ్వాలో తెలియలేదు, ఆలోచిస్తూ నడవసాగాడు.

ప్రకాశానికి అసంతృప్తిగా ఉంది. మూర్తి ఎంతసేపటికీ నీతిని గురించి మాట్లాడుతున్నాడు. అతనికి చిరాకు వేసింది.

"మీ రెప్పుడూ నీతిసరిహద్దుల్ని దాటలేదుకాబోలు."

"లేదు." అన్నాడు మూర్తి దృఢంగా, గర్వంగా.

ప్రకాశంఅసంతృప్తి మరీ ఎక్కువైంది.

"మీకు అవకాశందొరకలేదు, అంతే." నవ్వాడు.

"అవకాశంలో ఏముంది? మనసులో ఉంటుంది," అన్నాడు చాలా తేలిగ్గా మూర్తి.

ప్రకాశంకి రోషంకలిగింది.

"మీలో రసికతలేదు. జీవితంఅనుభవించటం మీకు చేతకాదు."

మూర్తిముఖం ఎర్రబారటం ఆ వెన్నెల్లో స్పష్టంగాచూశాడు ప్రకాశం. అతనిని రెచ్చగొట్టాలనే అలా అన్నాడు. ఫలితానికి సంతృప్తి చెందాడు.

"గాడితప్పిన జీవితం అంటే ఏమిటో తెలుసుకోవాలంటే సరాసరి ఏటిగట్టుకి వెళ్ళండి."

"ఎందుకు?"

"అవకాశాన్ని ఎదుర్కోటానికి."

"ఏమిటి మీ భావం?"

"అక్కడికి సుహాసినివస్తుంది."

నెత్తిమీద పిడుగుపడ్డట్టయింది మూర్తికి. ఒక నిమిషందాకా తేరుకోలేకపోయాడు.

"సుహాసిని!" అన్నాడు తనలోతను అనుకుంటున్నట్టు.

"అవును. మీ స్టెనో."

"ఆమె ఎందుకు వస్తుంది?"

"పౌర్ణమినాటిరాత్రి ఏటిగట్టున విహారంచెయ్యటం ఈ ఊళ్ళో అత్యాశ్చర్యకరమైన విషయంకాదు."

"ఆమె వస్తుందని మీ కెలా తెలుసు?"

"తెలియకపోతే ఎందుకుచెబుతాను, ఆమెసంగతి నాకు బాగా తెలుసు. ఆఫీసులోని ఇంకా ఇద్దరుముగ్గురు స్టెనోల విషయంకూడా నాకు తెలుసు," అన్నాడు ప్రకాశం దృఢంగా ఈసడింపు వ్యక్తంచేస్తూ.

నిజంగా షాక్‌తగిలినట్టయింది మూర్తికి.

"అయితే నేను వెళ్ళటం దేనికి?"

ఈసారి ప్రకాశం చాలా ఎబ్బెట్టుగా నవ్వాడు. తనని ప్రకాశం అనవసరంగా అనుమానిస్తున్నాడేమోనని మూర్తి బాధపడ్డాడు.

"మీరు వస్తున్నారని ఆమెకి తెలియదు. నేను వస్తున్నానని తెలుసు. అంటే మరేంలేదు. మాటలసందర్భంలో పౌర్ణమినాటి రాత్రి ఏటిగట్టుకి వెళ్ళటం రివాజు అని ఆమె అంది. నాక్కూడా రివాజేనని చెప్పాను. ఒకవేళ మీ కామె కనిపిస్తే, నేను రాలేదేమని అడిగితే, తలనొప్పివల్ల రాలేకపోయానని చెప్పండి. శుభం." వ్యంగ్యంగా హేళన ధ్వనిస్తూ అహంకారపూరితంగా ఈ మాటలని ప్రకాశం గిరుక్కున వెనక్కితిరిగాడు. మూర్తి తటాలున అతని చెయ్యిపట్టి వెనక్కిలాగాడు.

"మీ మాటలు నాకేమీ బోధపడలేదు. నేను ఇంటికివెడుతున్నాను. మీరుకూడా వస్తేరండి, మీ ఇష్టం, "అనేసి ముభావంగా ముందుకి నడిచాడు. ప్రకాశం అతని భుజంతట్టి ఊరుకున్నాడు. కొంతదూరం నడిచాక

మూర్తి వెనక్కి తిరిగి చూశాడు. ప్రకాశం తనతో రావటంలేదు. దూర దూరంగా ఏటివైపువెడుతున్నాడు. అతనిమాటలు మూర్తికి బాధకలి గించాయి. ప్రకాశం ఎక్కువగా ఆలోచించేవ్యక్తికాడు. ఏదితోస్తే అది చేయటం, ఏమాట అనాలనిపిస్తే ఆ మాట అనటం అతని కలవాటు. ఈ విషయం మూర్తి పూర్తిగా అవగాహన చేసుకున్నాడు. కాని తనని రొంపి లోకిలాగాలని అతను ఎందుకు ప్రయత్నిస్తున్నాడో అర్థంకావటంలేదు మూర్తికి. ఆలోచనల్లో సతమతమౌతున్న మూర్తిమనస్సులో సుహాసిని మెదిలింది. ప్రకాశం ఆమెనిగురించి ఏదో అన్నాడు. అందులోనిజమెంతో తెలుసుకోవాలనిపించింది మూర్తికి. కాని నిజం దాచవలసిన అవసరం ప్రకాశానికి లేదు. తనతో అతను అబద్ధ మెందుకు ఆడతాడు! తను సుహా సినికిచ్చిన చనువేమీ ఎక్కువకాదు, ఇందులో అనుమానించటానికి అవ కాశంలేదు. ప్రకాశం కావాలని తనమీద మాటలు విసరలేదని నిశ్చయించు కుని తృప్తిపడ్డాడు మూర్తి.

ప్రకాశం రాత్రి ఎన్నిగంటలకి ఇంటికి వచ్చాడో మూర్తి గమ నించలేదు. తెల్లవారింతరవాత అతనిని చూడాలనికూడా అనిపించలేదు. కాని ఏం జరిగిందో తెసుసుకోవాలనే కుతూహలం మాత్రం కలిగింది. అయినా ప్రకాశాన్ని ఈ విషయం గురించి కదిలించలేదు. అతనుకూడా రాత్రి ఏమీ జరగలేదన్నట్టుగానే ప్రవర్తించాడు.

"ఆఫీసుగదిలో ప్రవేశించగానే మామూలుగా సుహాసినే మొదట కనిపించి నమస్కారం చేసింది. ప్రతినమస్కారం చేస్తూ ఆమెని నఖ శిఖపర్యంతం పరిశీలనగా చూశాడు. ఆమెలో మార్పేమీ కనిపించలేదు. మామూలుగానే నవ్వుతూ, సుతారంగా మెలికలుతిరుగుతూ, ఉల్లాసంగా మాట్లాడుతూ, వాలుగా చూపుల్ని ప్రసరిస్తూ ప్రవర్తించసాగింది. అయినా ఆమెని చూస్తూంటే అతనిలో ఏదో అనిష్టత కలిగింది. ఆమె నోట్ బుక్ చేత్తో పట్టుకుని పెన్సిల్ ఆడిస్తూ మామూలుఉత్సాహంతోనే అడిగింది.

"ఏమైనా ఉత్తరాలు చెబుతారా సార్?"

"ఏమీలేవు ప్రస్తుతం," అన్నాడు ముక్తసరిగా.

ఆమె అతనిలోని అప్రసన్నత కనిపెట్టింది.

"అలా ఉన్నారేమండి?" అంది.

"బాగానే ఉన్నాను." అన్నాడు మూర్తి తలెత్తకుండానే.

ఆమె కొంచెంతటపటాయించి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోగానే మూర్తి కొంచెం బాధపడ్డాడు. ప్రకాశం అనవసరంగా ఆమెమీద లేనిపోని అభాండంవేశాడేమో. తనమీద కోపాన్ని అలాతీర్చుకున్నాడేమో. ఏమైనా, తనకెందుకు? ఆమె తనస్టెనో. పనివుంటే పిలిచి ఉత్తరాలు రాసుకోమంటాడు. లేకపోతే ఊరుకుంటాడు. తన కామె జోలిఎందుకు?

పరధ్యానంగా ఆఫీసుటైమంతా గడిపి అయిదుకాగానే సుహాసిని మేలుకొలుపుతో కుర్చీనించి లేచాడు మూర్తి. పరధ్యానంలో కోటువేసుకోటం మర్చిపోతే ఆమెఅందించి నల్లటికళ్ళతో నవ్వింది.

"ఆఫీసుపనిలో ఇలా సర్వం మర్చిపోయేవాళ్ళకి ప్రమోషన్ త్వరలోరాదండీ!" అంది సుహాసిని అతని మందస్మితవదనాన్నిగమనించి ధైర్యంగా.

"నాకుప్రమోషన్ వొద్దులెండి," అన్నాడు మూర్తి వెనకటి ఉత్సాహాన్ని మళ్ళీతెచ్చుకొని.

"అదేంమాటండీ? చేరినప్పటినించీ న్యాయంగాఉంటూ ప్రమోషన్ కోసం ప్రయత్నిస్తున్నారుగా?" అంది సుహాసిని నవ్వుతూ.

ఆమె ఇంతచొరవఎందుకుతీసుకుంటుందో మూర్తికి అర్థంకాలేదు. పొడిగా నవ్వి యింటికివచ్చేశాడు. ఇంటికివచ్చి బట్టలుమార్చుకోగానే శ్రీపతి వచ్చాడు. అతనిముఖంలో ఆనందం తాండవించింది.

"భేష్, మూర్తిగారూ. నిజంగా మీరుచాలమంచివారు. సేఠ్‌పర్మిట్ మీద సంతకంపెట్టారని తెలిసింది. సేఠ్‌జీ స్వయంగావచ్చి మీదర్శనం చేసుకొని ఋణంతీర్చుకుంటాడు. మాటతప్పేమనిషికాదులెండి. చూడండి, అప్పుడు అడ్వాన్సుబాపతుడబ్బు మీరు తిరస్కరించారు. అయినా నే నది సేఠ్‌కి ఇంకా వాపసివ్వలేదు. నాకుతెలుసు. మీరు చాలా మంచివారు. ఇదిగో, ఇదిమీదే. ఇహ నేనువెడుతున్నాను. సేఠ్‌తో మీ రేం పరిష్కారం కుదుర్చుకుంటారో, మీయిష్టం"

మూర్తి దిగ్భ్రాంతుడైనాడు.

"పర్మి టేమిటి?" అన్నాడు.

"అదే, ఫూల్‌చంద్ పర్మిట్"

మూర్తికి ముచ్చెమటలుపోశాయి. తను ఆ రోజంతా పరధ్యానంగా ఫైల్స్‌చూశాడు. పొరపాటున సంతకంపెట్టేశాడుగావును. ఇప్పుడు మళ్ళీ ఆ కాగితాలు తెప్పించి రద్దుచెయ్యటం భావ్యంకాదు. ఏంచేసేట్టు? ఆపర్మిట్ విషయంలో ఏదో పేచీఉండిఉంటుంది. సేఠ్ ఊరికే డబ్బెందుకిస్తాడు. మూర్తి తననితను శపించుకున్నాడు.

"శ్రీపతిగారూ, ఒక్కసాయంచేయండి. ఈడబ్బు తీసుకెళ్ళి సేఠ్‌కి అందచేయండి. అతన్ని నాకు కనిపించవద్దనిచెప్పండి. ఈఉపకారం చెయ్యండి," అన్నాడు ముఖంలో ఏభావమూ ప్రస్ఫుటంచేయకుండా. శ్రీపతి ఆశ్చర్యపోయాడు. ఏదో తికమక జరిగిందని అనుకున్నాడు. మూర్తివైఖరి చూస్తే సంభాషణకి ఏమీ తావుకనిపించలేదు. శ్రీపతి మాట్లాడకుండా ముఖంచిన్నబుచ్చుకొని ఆ డబ్బు తీసుకుని వెళ్ళి పోయాడు.

మూర్తిలో అశాంతి ఎక్కువైంది. ఏదో ఇల్లుచూసుకొని అందులోకి బసమార్చాడు. రోజులు గడిచిపోతున్నాయి. రామదాసు అతన్ని గుళ్ళోకి తీసుకువెళ్ళి ఉపదేశంచెయ్యాలని అప్పుడప్పుడు ప్రయత్ని స్తూనే ఉన్నాడు. ప్రకాశం తన ధోరణిలో ఉపన్యాసాలు ఇస్తూనేఉన్నాడు. సుహాసిని తన మామూలువిన్యాసాల్తో చొరవగా మాటలంటూనేవుంది. మూర్తి మాత్రం రాయిలా చలించకుండా తనకి తోచినట్టుగా ఆఫీసుపని చేస్తూనే ఉన్నాడు.

ఆకాశంలోని తెల్లటికాంతికిమూలంవెతుకుతూ తెలిమబ్బులు,దిక్చక్రం పైన పదహారు వన్నెలతో నాటకీయంగా ప్రత్యక్షమైన చంద్రబింబాన్ని ఆశ్చర్యంగా దగ్గిరికి వచ్చిచూసి ఆ విషయం ఆకాశమంతాచాటటానికి ప్రయాణిస్తున్నాయి.

చంద్రుడు భూలోకసౌందర్యాన్ని చూడటానికి ఆకాశపు మెట్లెక్క సాగాడు.

వెన్నెల్లో స్నానంచేసి తెల్లగా మెరుస్తున్నాయి మల్లెలూ, విర జాజులూ.

ఏరు సంతోషంతో ఉరకలువేస్తూ ఉప్పొంగిపోతోంది. మూర్తి ఏటిగట్టునే నడుస్తున్నాడు. గట్లమీది చెట్లు నవనవలాడుతూ సంతోషంగా

ఊగిపోతున్నాయి. గాలి ఉత్సాహంగా ఆకాశంలో సుడులుతిరుగుతూ నాట్యంచేస్తూ పుష్ప పరిమళాన్ని చంద్రుడికి నివాళినిస్తోంది.

ప్రకృతి సమస్తం నవయవ్వనంతో, నిండు ఉత్సాహంతో తొణికిసలాడుతోంది.

మూర్తి ప్రకృతిలోని ప్రతి అందమూ కన్నులపండువుగా చూస్తూ నడుస్తున్నాడు.

ప్రవాహం వయ్యారంగా మెలికలుతిరుగుతూ పోతోంది.

అలలు లేచిపడుతూ తరగని ఉత్సాహంతో నృత్యభంగిమలతో ముందుకి సాగిపోతున్నాయి.

ఆ ఏటి అందం చూస్తుంటే అందులో మునకలువేస్తూ ప్రవాహంతో సాగిపోవాలని బలీయమైన వాంఛకలిగింది మూర్తికి. గట్టు దిగి ఇసకదిబ్బలమీద నడవసాగాడు. దూరదూరంగా అక్కడక్కడ కొంతమంది తనలాగానే ఏటితో ఆడుకుంటూ ఆనందిస్తున్నారు.

ఏటిమీదికి వంగిన కొబ్బరిచెట్టుమొదల్లో ఎవరో లీలగా కదిలారు.

ఆ కొబ్బరిచెట్టువైపుకే నడుస్తున్న మూర్తి అది గమనించి పరకాయించి చూశాడు.

చిరుగాలికి తెరచాపలా తెల్లటి చీరకొంగు రెపరెపలాడుతోంది.

దగ్గిరగా వచ్చాడు మూర్తి. బండలకి తగిలిపడుతూ నురగలు కక్కే అలల్ని చూస్తూ మైమరచిన ఆమె అతనినిచూడలేదు. కాని మూర్తి స్పష్టంగా చూసి వెనక్కి ఒక్క అడుగేశాడు. కాని అడుగెయ్యటంలో పాదం బ్రహ్మజెముడుమట్టమీద పడి ముళ్ళుగుచ్చుకోటం, అతను 'అబ్బ' అని పాదం పైకెత్తటం ఒక్కసారే జరిగాయి. ఆమె ఉలిక్కిపడి లేచినుంచోటం, అతని పాదంలోని బ్రహ్మజెముడుఆకు చూడటం, తటాలున అది లాగివేయటం ఇంచుమించుగా క్షణంలో జరిగిపోయాయి.

"సుహాసినీ!" అన్నాడు మూర్తి.

గబుక్కున తలెత్తి ఆమె అతనిని చూసి విస్మయంతో "మీరా?" అంది.

"అవును." అన్నాడు మూర్తి.

"ఇలా వచ్చారేం?" అం దామె.

"పౌర్ణమి కదూ?" అన్నాడు మూర్తి. ప్రకాశంమాటలన్నీ అతని చెవుల్లో మారుమ్రోగాయి.

"పౌర్ణమినాడు నిజంగా ఎంత బావుంటుందండీ ఏరు!" అంది ఆమె ఆరాధనాపూర్వకంగా.

"నేను రావటం ఇదే మొదటిసారి," అన్నాడు మూర్తి.

"నేను నాలుగైదుసార్లు వచ్చానండి. ప్రతి పౌర్ణమికీ తప్పక వస్తున్నాను.

"అయితే మీరుకూడా కొత్తగానే ఉద్యోగంలో చేరారన్నమాట."

"అవునండి. రెండుమూడు నెలలవుతుంది."

"ఇలా మీలాంటివాళ్ళు ఒంటరిగా రావటం మంచిదికాదేమో!" అన్నాడు మూర్తి.

"నాకెవరూ లేరు, ఏంచేయను?" అందామె తలదించుకుని.

"ఒంటరిగా ఇక్కడ కూచుని ఏంచేస్తారు?"

"కబుర్లు చెప్పండి. వింటాను," అందామె నవ్వి మూర్తిపైపు కళ్ళప్పగించి చూస్తూ. ఆమె నల్లటికళ్ళవైపు చూశాడు. వాటిలో ఏదో ఆకర్షణ అతనిచూపుల్ని ఆకట్టింది. ఆమె కళ్ళని పక్కకి తిప్పుకొంది.

"మీ కళ్ళు బాగుంటాయి," అన్నాడు.

ఆమె విషయాన్ని తప్పిస్తూ "ఏరు ఎంతబాగుందోచూడండి." అంది

ప్రకాశంమాటలు జ్ఞప్తికివచ్చాయి మూర్తికి.

"యవ్వనంలా!" అన్నాడు.

సుహాసిని మాట్లాడలేదు. గాలికి ఆమె ముంగురులు ఎగిరి నున్నటి బుగ్గలమీద నాట్యంచేస్తున్నాయి. ఆమె వాటిని పైకి తోసుకుంటుంటే చీర గాలికి వత్తాసుఇస్తోంది.

ముగ్ధుడై మూర్తి ఆమె యవ్వనరేఖాలావణ్యాన్ని చూస్తున్నాడు.

పదహారువన్నెల చంద్రబింబం వెన్నెలలుకురిపిస్తోంది. ఎక్కడో ఆకాశంలో కాదు. ఇసుకదిబ్బమీద కొబ్బరిచెట్టుమొదల్లో.

"తెల్లటిచీర వెన్నెలలాఉంది. కాదు వెన్నెల తెల్లచీరలాఉంది," అన్నాడు తికమకగా మూర్తి.

సుహాసిని విని ఊరుకుంది. చిన్ననవ్వు ఆమెపెదవులమీదవిరిసింది.

"నవ్వకండి. చంద్రుడు సిగ్గుపడి దాక్కుంటాడు."

ఇదేంధోరణిఅన్నట్టు సుహాసిని మూర్తివైపు చూసింది. ఆ చూపులు తూపులై అతని హృదయంలో గుచ్చుకున్నాయి. ప్రకృతిలో ఎక్కడో వేణువు ఎవరో ఊదుతున్నట్టుగా, కోకిల తీయగా పాడుతున్నట్టు అనుభూతిపొందాడు. "సుహాసినీ!" అన్నాడు.

"పొద్దుపోతోంది, పదండి" అందామె.

మూర్తికదల్లేదు. పొంగిపొర్లే ఏరువైపూ, వెన్నెలకురిసే శశిబింబం వైపూ, సుహాసిని అందాలవైపూ చూస్తూ ఏదో మధురానుభూతి పొందుతున్నాడు.

ఏరు గట్లుదాటి విచ్చలవిడిగా పొంగి యథేచ్ఛగావిహరిస్తున్నట్టుగా అతని మానసాకాశంలో దృశ్యం కనిపించింది.

సుహాసిని అడుగు ముందుకేసింది. తటాలున ఆమెచెయ్యిపట్టుకొని ఆపాడు. ఆమె అదిరిపడ్డది.

"వదలండి!" అంది భీతితో.

"సుహాసినీ!" అన్నాడు ఆసక్తితో.

"వదలండి!" అందామె గాద్గదికంగా.

"ఉఁహుఁ"

ఆమె విడిపించుకోసాగింది. ప్రకాశంపాటి చెయ్యిడా తను! మూర్తి పెంకెగా, బలంగా ఆమెని దగ్గిరికి లాక్కున్నాడు.

చలించే ఆమెఅధరాలని చుంబించటానికి తలవంచాడు.

చెంప ఛెళ్ళుమంది.

మరుక్షణంలో సుహాసిని అతనికి గజంమారంలో రొప్పుతూ నిలబడ్డది.

"ప్రకాశం మూర్ఖుడు, పశువు. రెండుచెంపలూ ఛెళ్ళుమనేదాకా వదల్లేదు. మీరు మంచివారే, కాని.... కాని.... క్షమించండి," అని గాద్గదికంగా గబగబాఅనేసి సుహాసిని గిరుక్కున వెనక్కితిరిగి చరచరవెళ్ళిపోయింది.

మూర్తి నిశ్చేష్టుడై ఆమె వెళ్ళినవైపే చూస్తున్నాడు.

—:)o(:—

# తెరచాప దించిన పడవ

బుచ్చిబాబు

సెలవలకి పైవూళ్ళువెళ్ళివచ్చింతర్వాతనే మనం నిజంగా విశ్రాంతి పొందడంజరుగుతుందిట. ఈసందర్భంలో అల్లానే జరిగింది. మామయ్యకి మరోవూరికి బదిలీఅయింది. ఆమధ్య సెలవలకి ఆ కొత్తఊరెళ్ళాను. పిల్లలకి తండ్రివైపువారిమీదకంటె తల్లివైపు బంధువులపట్లనే ఎక్కువ చనువు, ఆపేక్ష వుంటాయంటారు. మామయ్యపట్లఇదివర్తించదు. తండ్రివైపుచుట్టమే. నాకు చాలాచనువు-ఎందుకోతెలీదు. వితర్కిస్తే చాలాకారణాలగపడతాయి. ఆయనా, అత్తయ్యా అన్యోన్యంగా వుంటారు. ఆవిడ సణుగుళ్ళని ఆయన నవ్వివూరేస్తాడు. ఏచిక్కువొచ్చిపడినా చికాకుపడడు. ఆయనకి జబ్బుచెయ్యడం ఎవ్వరం ఎరగం. ఆధునికయుగంలో రకరకాల జబ్బులు, — మానసికం, శారీరకం — వొచ్చిపడుతున్నాయి — వాటిని రూపుమాపే పరిశోధనలు తీవ్రంగా కొనసాగుతున్నాయి. ఇవేవి ఆయనకి సంక్రమించనందుకు ఆయన్ని వొకఅపూర్వవ్యక్తిగా పరిగణించినా అతిశయోక్తికాదేమో! డాక్టర్లు, లాయర్లు, పోలీసులు—వీరిచేతుల్లోపడకుండా జీవితంగడిచిపోవాలని ఆయన నిర్వచనం. ఆయనంటె నాకెందు కిష్టమో చెప్పలేను. కూడనిపని చేసినా, మాటఅన్నా, తీర్పుచెప్పడు. నవ్వుతాడు—అది కేవలం పెదవులమీద బలవంతంగా అమర్చిన మందహాసం కాదు. జీవితంపట్ల మనస్సులో పాతుకుపోయిన ఒకదృక్పథం పెదవులమీద విడిచేసిన 'మాయ' అనబుద్ధేస్తుంది. చుట్టకాలుస్తో, జీవితాన్ని తిలకించి నవ్వుతాడు. పొగవిడుస్తాడు. అది గుండ్రంగా విడి, పెద్దదయి, పెరిగిపోతున్న విశ్వంలా 'అనంతం' లోకి వ్యాపించి మాయమౌతుంది. మళ్ళా నవ్వుతాడు.

"ఎందుకు మామయ్యా నవ్వుతున్నావు?"

"చుట్ట ఆరిందిరా—అంకెళ్ళు పడిపోతున్నా పొగరావడంలేదు."

ఏదో గంభీరమైన ఆలోచనాపరంపరనుండి ఆ నవ్వు వికసించిందీ అనుకోడానికిలేదు.—తీరా చేసి చుట్టఆరిపోయిందట! ఒక్కొక్కసారి

జీవించడం అంటే ఏమిటో తెలీని—వూరికే తిండితిని, వూపిరితీసే—ఒక సాధారణయంత్రంలా కనిపిస్తాడు. ఉద్రేకాలు, క్రోధాలు, బాధలు, సంఘర్షణలు, గాఢంగా వాంఛించడాలు, ఆదర్శాలపెత్తనం, శీలంపోగొట్టుకోడం వగైరా ఆధునికతత్వం ఆయనమీద ఏ కసరత్తూ చేసినట్లులేదు.—కాబట్టి నిండైన జీవితంకాదేమో అనుకొనేవాడిని. లేకపోతే అవన్నీ జరిగి, మిగిలినమనిషి ఇల్లా తయారయ్యాడేమో! నాకు తెలీదన్నానుగా. ఓమారు అడిగేశాను—లౌక్యంగా.

"ఏం మామయ్యా,— గొడవలు, ప్రమాదాలు —నీ కేమీ జరగలేదా?"

"ఎందుకు జరగలేదురా — గవర్నమెంటుఉద్యోగిని అవేవీ తాకవు. పదేళ్ళ గీతవల్లెవేస్తే అబ్బని నిబ్బరం, పదినెల్లు గవర్నమెంటు ఉద్యోగంలో అబ్బుతుందిరా అబ్బీ."

కమ్యూనిటీ డెవలప్‌మెంట్‌వారి ఆధ్వర్యాన కొత్తభవనం నిర్మిస్తున్నారు ఊరవతల—దాని నిర్మాణకార్యక్రమం మామయ్య చూస్తున్నాడు. చూసొద్దాం రమ్మనమంటే బైలుదేరాం.

చాలా చిన్నవూరది. ఇరవైయేళ్ళక్రితం ఓపాతికగుడిశెలుమాత్రం ఉండేవిట. అంతా అడివిలా పెద్దపెద్ద చెట్లు, గుట్టలు, రాళ్ళు, కొండలు మధ్యమధ్య చదునైన ఎర్రనేల—కాస్తమేర దుబ్బులామొలిచిన పచ్చికబైలు, విరుద్ధమైన శీతోష్ణస్థితులను సూచించే భూభాగం, ప్రకృతిదృశ్యం అక్కడ కలిసివున్నాయి. దూరంగా కొండలమధ్య చిన్న సరస్సు.— మళ్ళా చదునైన నేల—రెండుమూడు ఫర్లాంగు లివతల నాలుగైదు గుడిసెలు. వాటికి ఓ ఫర్లాం గివతలగా స్థలం సేకరించి, ప్రభుత్వంవారు కమ్యూనిటీ హాల్ కట్ట సంకల్పించారు. కాని ఒక పేచీవచ్చింది. వారికి కావల్సినస్థలంలో కుడివైపుమూలగావున్నభాగం,— పెద్దగుడిసెలో వుండే వృద్ధురాలు, విదురమ్మది. ఏదో కొంత ముట్టచెప్పి, ఆ కాస్త స్థలమూ తమ స్థలంగా చేసుకొని అందులో కొత్త భవనం నిర్మిద్దామని బ్లాక్ అధికారులు పునాదులుతవ్వి కట్టడంప్రారంభించారు. ఇందుకు విదురమ్మ వప్పుకోలేదు. తీరాచేసి అది నాలుగైదుగజాల నేల, ఆమీద రెండు పెద్దరాతిబండలు, వాటి నడుంగా ఒకచెట్టు వున్నాయి. ఆ చెట్టు

కొట్టించి కలప ఆమెకే ఇచ్చివేస్తామన్నారు. కావాలంటే ఆ రాతిబండలు కూడా తవ్వించి, ఆమెభాగంగా వుంటున్న చుట్టూస్థలంలో వేయిస్తామన్నారు.

విదురమ్మ అంగీకరించలేదు. సంప్రదింపులకి మామయ్యని పంపారు. ఆమె వల్లకాదంది. కారణం మాత్రం చెప్పదు. చుట్టుపక్కల గుడిశలలో ఆమె స్నేహితురాండ్రచేత చెప్పించిచూశారు. అక్కడి భూమికి వున్నధరకంటే అదనంగా ముట్టచెపుతామన్నారు.ససేమిరా— వీల్లేదంది. మా మామయ్య 'ఇదంతా అవకాశం దొరికినప్పుడు మసిలాళ్ళు చలాయించే అధికారచిహ్నం. ఇదొక నాటకం. చివరికి ఒప్పుకు తీరుతుంది. మరేంపరవాలేదు. నా పూచీమీద కానియ్యండి'— అని కట్టడం పని కొనసాగించమన్నాడు. పని ప్రారంభించారు.

ఇది తెలుసుకొని విదురమ్మ అక్కడినుంచి ఎక్కడికో వెళ్ళిపోయింది. ఎవరితో సంప్రదించడం? వాకబుచేశారు. విదురమ్మకొడుకు ఎక్కడో ఉత్తరహిందూస్తానంలో వున్నాడుట. ముప్ఫైఏళ్ళగా వెళ్ళాడుట. మళ్ళా అజాపజా లేదు. ఒక కూతురుంది. భర్త కలపవ్యాపారంట. యుద్ధంరోజుల్లో వారు రంగూన్ వెళ్ళిపొయ్యారు. రాకపోకలు, ఉత్తర ప్రత్యుత్తరాలు పాతికేళ్ళగా లేవు. మొదటి ప్రపంచయుద్ధంరోజుల్లో యుద్ధంలోకివెళ్ళిన భర్త, భద్రన్న, యుద్ధం ముగిసిన రెండేళ్ళు డబ్బు పంపుతూ, వొచ్చితీసుకెడతానని జాబులువ్రాస్తూండేవాడుట. తరువాత ఆ జాబులు నిలిచిపొయ్యాయి. భర్తది మూడెకరాలభూమి ఈమెకి సంక్రమించింది. మహజర్లుపెట్టుకుని, రెండేళ్ళు అధికారులతో మొరెట్టుకున్నాక, ఒకతాశీల్దారుగారి కనికరంవల్ల, నెలకి పదిరూపాయలు ఈమెకి ముట్టచెప్పే ఏర్పాటు జరిగింది. ఆ నేలలో ఇల్లువేసుకుని, ఇన్నేళ్ళగా అందులోనే ఒంటిగావుంటూ పశువులు, పాలేళ్ళని పెట్టుకుని, పాలుసప్లయ్ చేస్తూ కాలక్షేపంచేస్తోంది. అది విదురమ్మ పూర్వచరిత్ర.

బెదిరించడం, లాలన, బ్రతిమాలడం— ఇవన్నీ జరిగాయి. మామయ్య నవ్వుతాడు. నిజానికి ప్రభుత్వంపూనుకున్నాక, విదురమ్మ అనుమతిఅంటూ అవసరంలేదు. అయినా, మంచిగా ఏదో కాస్తముట్టచెప్పి

ముసలిదాన్ని సంతోషపెట్టడమే అధికారులఉద్దేశం. ఆవిడ కాదనడంతో ఉభయత్రా కాస్తంత రోషాలు మొలకలెత్తాయి.

నేను మామయ్యతో పనిమీదికి వెళ్ళినరోజే, విదురమ్మ తిరిగి తన గుడిసెలోకి ఒచ్చిందట. ఇద్దరం ఆమెఇంటికే బైలుదేరాము. సాయంత్రం నాలుగైందేమో, గుమ్మంముందు పెద్ద రాతిబండలు, వాటి నడుంగాఉన్న నీడలు, గుమ్మంముందు పందిట్లోకి సాగాయి. ఆ పందిరికింద నులక మంచంమీద పడుంది విదురమ్మ. దక్షిణంవేపు, మూలగా గేదెలు కట్టేసున్నాయి. పాలేళ్ళు ఏదో సవిరిస్తున్నారు. పశువులవాసన మమ్మల్ని ఒపరించింది. పేడ, పిడకలు, ఎండుగడ్డి, చుట్టపొగ చూరుమీంచి పొయ్యిపొగ, నులకమంచం, పలుపు, చెంబు,—ఆ వాసన—'భారత భూమి' అంటే ఇవే స్మరణకొస్తాయి నాకు. నులకమంచంపైన రోజాయిమీద పడుంది విదురమ్మ. మమ్మల్నిచూసి నవ్వింది. కాని లేవలేదు. నవ్వుకోసం పెనుగులాడుతున్నట్లు ముడతలుపడి, చర్మం ఎముకల్ని పీడిస్తున్నట్లగపడేమొహం ఆమెది. ఒడిలిన జామిపండు ఛాయ, జుట్టంతా నెరిసింది. ఎక్కడా రాగివెంట్రుకకాని, ఏకాంతజీవిగా నలుపు వుంచుకోగలిగిన ఒక్కవెంట్రుకా లేదు. కనుబొమ్మలుకూడా అదేరంగు. ఎండకి. బీటలుతీసిన ఎడారినేల. వర్షానికి చటుక్కుని దగ్గరగా జరగడంలో నొక్కుకుపోయినట్లు పల్చటి పెదవులు—వాటివెనక పరీక్షగా చూస్తే కాస్త మెరుపు మిగుల్చుకున్న పళ్ళవరసమీద మసకగా కదిలే నవ్వు—తుఫానంతా అణగారింతర్వాత ఎక్కడనుంచో దోవతెలీక ఒచ్చిపడ్డ తెల్లమేఘంలా. సూర్యగ్రహణం జరిగినప్పుడు ఒడిలి జారిన రావాకులా చెవులు—వాటిల్లో లవంగాలు, తెల్లచీర—తెలుపు కాస్తమాసిన తెలుపు. మూసుకున్న శరీరఛాయలో కలిసిపోయింది. ఆమె మొహాన ఎన్ని ముడతలున్నాయో, ఆ చీరని అన్ని ముడతలూ వున్నట్లనిపించింది. చూచేవాడు యువకుడైనప్పుడు వార్ధక్యం అంతగా అగపడుతుందంటారు. నా కట్లా గనిపించింది. ఫోటోలు తీసేవాళ్ళు 'ఒక వృద్ధస్త్రీ' అన్న ఫోటోని ఎగ్జిబిషన్‌లో ఎందుకు పెడతారో తెలిసింది నాకు. శిల్పులు, చిత్రకారులు, వార్ధక్యాన్ని ఎందుకు చిత్రిస్తారో తెలిసింది నాకు. అది స్వచ్ఛమైన, స్థిరమైన సౌందర్యం. దాని చిత్రణ స్వచ్ఛమైన కళ.

యువకుడు ఎదుగుతాడు. మానసికంగా పెరుగుతాడు. మనస్సు శరీరాన్ని మారుస్తూవుంటుంది. ఉద్రేకాలు కెరటాలలా లేచి శరీరం అనే నౌకని గెంటుతూ, ముంచివేస్తూవుంటాయి. తేరుకుని, బైటపడేటప్పటికి శరీరంలో ఏంమిగుల్తుందో ఎల్లాతయారవుతుందో—వార్ధక్యంలో శరీరం మారదు. తన ఉద్రేకాలు ఏమీ చెయ్యలేవు. తపన, అనుభూతి, దాన్ని కలవరపెట్టవు. స్వప్నం పీడించదు. అందుకనే స్వచ్ఛమైన సౌందర్యం అది.

తెరచాప దించివేసిన నౌక వార్ధక్యం. సముద్రంనడుంగా వుంటుంది — వడ్డుకి చేరడం అంటూ లేదు. అస లది కదుల్తున్నట్లే స్ఫురించదు. అందుకే స్థిరమైన సౌందర్యం అది. అల్లా తేలిపోతూ వుంటుంది. ఎప్పుడో ఒకసారి బుడుంగుమంటుంది. ఇందుకే కాబోలు చిత్రకారులకి, శిల్పులకి, కవులకి, వార్ధక్యం అంటే అంతమోజు.

విదురమ్మ వయస్సు డెబ్బైపైనే అంటారు చుట్టుపక్కలవాళ్ళు-ఆమె మాత్రం అరవైతొమ్మిది మొన్ననే వెళ్ళిందంటుందిట, పక్కింటి పేరమ్మతో. వృద్ధులకు వయస్సంటూ వుండదు. ఉన్నా ఎవ్వరూ పట్టించుకోరు—తోటివారిలో సమవయస్కులుతప్ప.

"ఏం విదురమ్మా ఏం తేల్చావ్?" అన్నాడు మామయ్య—నవ్వుతూ.

ఆమె నవ్వింది.

"మీరేం తేల్చారు?"

నాకూ నవ్వొచ్చింది. విదురమ్మకి నేవూహించుకున్నంత చెముడులేదు.

"మేం పని ప్రారంభించాంగా—గోడలు లేస్తున్నాయి."

"మీ గోడెవరిక్కావాల్లెండి," అంది విదురమ్మ, నావైపుచూస్తూ. ఆ చూపులో కొంచెం కొంటెతనం వుందేమో.

"మా క్కావాలిగనకనే—ఇంతగా నిన్ను బ్రతిమాలుతున్నాం."

"అమ్మో—ప్రభువులు. మీరు బ్రతిమలాడ్డమే! మిమ్మల్ని నేను బ్రతిమలాడాలి," అంది మాటలు తీరికగా ఉచ్చరిస్తూ. ఒత్తులు మినహా

మిగతావన్నీ స్ఫుటంగానే అంటోంది. ఆమె చదువుకోలేదు. పాత కాలపుది.

"ఇంతకీ ఈ నాలుగడుగులనేలా లేకపోతే నీ కేంలోటు?" అని అడిగాడు మామయ్య.

"ఆ నాలుగడుగులు విడిచేసి మిగతాదంతా తీసుకుపోండి ప్రభువులు —నా కిష్టమే," అని విదురమ్మ దగ్గుకోసం లేచికూర్చుంది.—కంఠం చుట్టూ—తన చేతులు బిగించి దగ్గుతోంది.

"ఈ నాలుగడుగుల విశేషమేమిటో అడగచ్చా?" అన్నాను ధైర్యంతెచ్చుగుని. నాకు మరీ పెద్దవాళ్ళతో మాట్లాడ్డం భయం. వారికి మనం అడిగిన ప్రశ్న అర్థంకాదనీ, ఓవేళ అర్థమైనా అడిగిన ప్రశ్నని బట్టి, మనం ఎట్లాంటివాళ్ళమో విలువకట్టి నిర్ణయించి, 'ఓస్, ఇంతేనా!' అని నవ్వుతూ తీసిపారేస్తారని—ఏదో భయం. వాళ్ళకి మతిమరుపు జాస్తి, మాట్లాడ్డం మొదలెడితే, వారి పాత గొడవలతో విసిగిస్తారనీ, మన వ్యాఖ్యానం, సానుభూతి కోరని వ్యక్తి ప్రకర్షగా పరిణమించే స్వగతంతో ఇబ్బందిపెడతారనీ—ఏవేవో అనుకూంటూఉంటాను.

తీర్చిన పొడగాటివేళ్ళ — చెవలచుట్టూ రేగిన దట్టమైన ఉంగరాలజుట్టుని పక్కకి తొలగించింది. చేతులకి, మెడలో — ఎక్కడా ఆభరణాలు లేవు. గణితశాస్త్రంలో తిన్నటిగీత, సూత్రాన్ని అతిక్రమించి ఒంకరలు తిరిగినట్లుగా వుంది ఆమె.

దగ్గునుంచి తేరుకుంది. ఆయాసంతో వూగిసలాడుతున్న గుండెలను అదిమిపట్టుకుంది. ఆమెకళ్ళు మూతలుపడుతున్నాయి, సముద్రకెరటం లుంగదీసి లోపలికిమడిచేసిన చందమామ ప్రతిబింబంలా. చెట్ల వెనక దిగుతున్న సూర్యుడి ఎర్రకిరణం ఆమె నుదిటిమీద ఎర్రబొట్టులా —గణితశాస్త్రంలో తిన్నటిగీతలా పడింది. నా కేసి తలెత్తిచూసింది. తల కదపడం — ఒకపాత్ర అభినయించడంలో గల తీక్షణమైన కార్యం — శిలాప్రతిమ కదిలినట్లు— గతం దిగవిడిచిన ప్రతిమ.

నవ్వింది — భూకంపంవెనక విధ్వంసక శక్తి నేలపైకని బైలుచేరి, సిగ్గుపడి లోపలికెళ్ళి తమాయించుకున్నట్లు కనబడే నవ్వు ఆమెది. — అది పెదవులమీద నవ్వుకాదు. పళ్లల్లోమెరిసేది కాదు. చర్మ మడ

తల్లో మరుగుపడ్డ నవ్వుకాదు, కళ్లవెనక మసగగా మెదిలే నవ్వుకాదు. — ఇవన్నీ కలిపి, నవ్వుదేవతంటూ వుంటే — మనస్సులో, దాగిన ఆ దేవతను బైటకుతెచ్చి, ముసుగుతీసి పల్లకిలో కూర్చోపెట్టినట్లూ, ఒక వాతావరణాన్ని నెలకొల్పే నవ్వది.

"అటుచూడండి అంది."

మేం, అటు ఇటూ చూస్తున్నాం.

"నా తిన్నగా ........"

ఆమెతిన్నగా రెండురాళ్లు, ఒకచెట్టు వున్నాయి. ఒకబండ నాలుగడుగుల ఎత్తుంటుంది. రెండోది కొంచం పెద్దది. మరో రెండడుగులుంటుంది.

"ఆ పెద్దది ఆయన— చిన్నది నేను. మళ్లా నవ్వుతోంది. — కానీ కళ్లల్లో తడి సంధ్యలో రక్తంచుక్కలా, నవ్వులోకలిసి తళుక్కుమంది.

"అక్కడే కూకునేవాళ్లం — పదాలు పాడేవాడు. పేపర్లు చదివి వినిపించేవాడు, నలభైఏళ్లనాటిమాట. ఇదంతా అడవి; అమ్మాయికి రెండో ఏడు. మంచంమీద పరున్నాం. చలిరోజులు. పక్కన కుంపటుంది. ఓ రాత్రివేళ చిరుతపులి గభాలున వచ్చింది గదిలోకి. నా పాదం కరచుకుంది. మంచంమీదనుండి లాగింది. కాలే కుంపటి నెత్తి కొట్టాను. పట్టువిడిచి పరుగెత్తింది." విదురమ్మ తనపాదంకేసి చూపింది. చిరుతపులి కాట్లుమాని మడతపడ్డ చర్మం ఇంకా కనబడుతూనేఉంది. ఆమె ధైర్య సాహసాలికి లోలోన-అభినందించాను. అవుతే ఇదంతా ఎందుకు చెబుతున్నట్లు?

"నువ్వు చాలా ధైర్యసాహసాలు గలదానివి. కూతురుకోసం అంత త్యాగంచేశావు — ఇప్పుడు ఈ ఊరు అభివృద్ధికోసం యీ కాస్త త్యాగంచెయ్యకూడదూ? చూడు — ఓ ఏడాదిలో ఎలక్ట్రిక్ దీపాలొస్తాయి. ఇక్కడో స్కూలు పెడతారు. లైబ్రరీ, పిల్లలఆటస్థలం, ఈతలాడడానికి చెరువు, ఉపన్యాసాలు, నాటకాలు జరుపుకోడానికి పెద్దభవనం — ఈ ఊరుస్వరూపమే మారిపోతుంది. — నువ్వు 'ఊఁ' అంటె" అన్నాడు మామయ్య ఉపన్యాసంధోరిణిలో.

"అదొక్కటి అడగమాకండి — నాధైర్యాన్ని తెగ మెచ్చుకొనే వా రాయన. చాలా పిరికాయన. అందుకనే యుద్ధంలో చేరాడు." అని మళ్లా మొదలు పెట్టింది విదురమ్మ. మామయ్య, నేను బిగ్గరగా నవ్వుతున్నాం.

"పిరికోడివని అస్తమానం దెప్పేదాన్ని. ఓసారి ఏంజరిగిందో తెలుసాండీ? అల్ల ఆ చెరువుకేసి నడిచెళ్లాం — నీళ్లలోకి దిగాను. తను దిగడు. ఈత రాదు. భయమంట. 'పిరికోడా' అని ఆడిపోశాను. మనిషైతే ఎర్రగా వుండేవాడు. — బక్కోడా అన్నాను. సన్నగా ఉండేవాడు. 'బక్కోడా' అనొద్దని కసిరాడు. బలశాలంట. చూపెట్టమన్నాను. ఏది పడితే అది చేస్తానన్నాడు. చెరువుఒడ్డున, పెద్ద రాతిబండలున్నాయి. వాటి మీద బట్టలుతికేదాన్ని. ఆ బండలు మన లోగిలికాడికి తీసికెళ్లగలవా అన్నాను. — ఓ అన్నాడు. కానీ మన్నాను. ఆ రెంటినీ దొర్లించు కొంటూ, వొగుర్చుకుంటూ, నాలుగు గంటలపాటు ఐరాణ పడి, రాత్రి పడేసరికి ఇంటిముంగలికి జేరేశాడు. "దొర్లించడమేగా— ఏం గొప్ప." అన్నా. 'తీసుకెళ్లగలవా అన్నాపుగాని, మోసికెళ్లగలవా?' అనలేదుగా అన్నాడు. ఆ బండలమీద కూర్చుని తెల్లవార్లు నవ్వుకున్నాను. ఆ పెద్ద బండ ఆ ఎర్రటిది లేదూ అది ఆయన. చిన్నది నేను. అది తీస్తారా, మమ్మల్ని చంపుకున్నట్లే" అంది విదురమ్మ. మళ్ళా దగ్గుతోంది. జ్ఞాప కాల బరువుతో మంచంబద్దీమీద వాలిపోయింది. మేం మాట్లాడలేక పొయ్యాం. పాలేళ్ళు వొచ్చారు. ఆమెను లోపలికి తీసుకెడుతున్నారు. "చూడు, విదురమ్మా—నువ్వు ఇంతగా చెబుతున్నావు కాబట్టి, ఈ నేల, రాళ్ళు, వొదిలేసి, వేరేస్థలంపైన భవనంకట్టించే ఏర్పాటు చేయిస్తాను, నువ్వు బెంగపెట్టుకోవద్దు." అన్నాడు మామయ్య అడుగులు వేస్తూ.

"ధర్మప్రభువులు—కనికరించండి" అంటూ పాలేళ్ళరెక్కలమీద లోపలికెళ్ళింది.

మేం ఇంటికొచ్చేశాం.

"స్థలం వదిలేసినట్లేకదా మావయ్యా?" అన్నాను దోవలో.

"ఏమోరా—ముసలాళ్ళకి పట్టెక్కువ. మనంకావాలని పట్టుడితే ఇవ్వనంటారు. వాళ్ళ వునికిని లోకానికి తెలియచేసేమార్గం పెంకిపట్టేగా! ఒద్దులేఅంటే 'కాదు, కాదు—ఆ స్థలంతీసుకోండి, బాబూ' అంటుందేమో

నని అల్లా అనిచూశాను. కానిది మొండిఘటం. ఆ బండలు గతించిన జీవితానికి చిహ్నాలు. వాటిపట్ల మమకారంఉండడం సహజమే. రెండే మార్గాలు మనకి. ఆ బండల్ని మరోచోటుకి జరిపించి, ఆ చెట్టు కొట్టించేసి మనం స్థలం స్వాధీనంచేసుకోడం ఒకటి, ఆ స్థలం విడిచేసి, తూర్పు వేపు కొంతభూమిని సంపాదించి అక్కడనుంచి పునాదులు త్రవ్వడం రెండోది. ఇప్పు డింకా ప్రారంభదశలోవున్నాం గనుక, ముసలిదాని చరిత్రంతా వ్రాసి, ఈ స్థలం విడిచివేద్దామని సిఫార్సుచేస్తూ రేపే వ్రాస్తాను, పైవాళ్ళకి" అన్నాడు. అల్లాగే వ్రాశాడు ఆ మొర్నాడు.

ఆ సాయంత్రం ఏమీతోచక నేను విదురమ్మగుడిసెదాటి కొండల మధ్య చెరువుకేసి నడచుకుంటూ వెళ్ళాను. అక్కడ ప్రశాంతంగా వుంది. చిన్నప్పుడు విదురమ్మ భర్తతో స్నానానికొచ్చిన దృశ్యం వూహించడం నావల్లకాలేదు. చిన్నవాళ్ళు వృద్ధులైన తర్వాత,వృద్ధులు చిన్నవారుగా వున్నప్పుడు ఎట్లావుంటారో వూహించుకోడంలో ఏదో తృప్తి కనబడుతుంది. ముఖ్యంగా మనం వృద్ధులు కానప్పుడు, మనకున్న వయస్సుకంటే ఓ ఇరవైయ్యేళ్ళ తరువాతకాని వార్ధక్యం రాదేమోననిపిస్తుందట. ఒకటి రెండు కప్పలు నీళ్ళల్లో పడ్డాయి. ఒడ్డునున్న రాళ్ళరంగే వాటిదీను. సూర్యుడు కొండవెనుక దిగుతున్నాడు. ఆ దృశ్యానికి వయస్సులేదు — కాలంలేదు. మనిషికే యీ రెండూను.

వెనక్కి తిరిగాను. గుడిసెలకేసి నడుస్తున్నాను. పాలమనిషి పేరమ్మ కనిపించింది. పలకరించాను. విదురమ్మఒంట్లో ఎట్లా వుందన్నాను.

"దాని కేం తెగులు. పదేళ్ళగా అట్లానేవుంది. ఇంకో పదేళ్ళ వరకూ భయంలేదు," అంది పేరమ్మ. రాగిరంగు జుట్టు, ఎత్తైన మనిషి. ఆభరణాలు లేవు— మెడలో అరంగుళం వెడల్పు బంగారుపట్టీతప్ప.

"పాపం, ఆమెని చూసేవా రెవరూ లేరుకదూ?" అన్నాను. పేరమ్మ నవ్వింది.

"దాని కేం లోటు. పాలమీద పాతికోపరకో ముట్టుతుంది. గవర్నమెంటోరు సాలీనా వందరూపాయలిస్తారు."

"మనుషుల ఆసరా — ఆదుకొనేవాళ్ళు వుండాలిగా," అన్నాను.

"మమ్మల్ని పూసుకుతిరుగుద్ది. కొడుకు కూతురు పట్టించుకోరు పాపం"

పాకలదగ్గిరికి చేరుకున్నాం.

"ఈ బండల్ని చూసుకుని, భర్తతోగడిపిన రోజులు స్మరించుకుంటూ కాలక్షేపంచేస్తుంది కదూ?" అన్నాను.

"ఆ కథ ఎన్నిమార్లు చెప్పిందో — అదో వెర్రికెంతి."

"నువ్వామెను చిన్నప్పుడు ఎరుగుదువా?"

"నేను పదేళ్ళుగా ఎరుగుదు. మొగుడు సావలేదు — ఎప్పుడో తిరిగివస్తాడు అంటూవుండేది, మేం వచ్చినకొత్తలో. ఆడొచ్చేతలికి, ఎళ్లినప్పుడెట్లా వుండేదో గదంతా అట్లాగుండాలట. బల్ల, కుర్చీ, మంచం — ఏవో పుస్తకాలు, ఒక బాకు, పులిచర్మం — ఇవన్నీ మొగుడున్నప్పుడు మాదిరిగా రోజూ సర్దుతూ, ఆడున్నట్లుగానే సంబరపడేది — రండి చూద్దురిగాని" అంది పేరమ్మ. రాతిబండలముందు గుడిసెదాటి దొడ్డివైపు వెళ్ళాం. అక్కడ ఓ పెంకుటిల్లుంది. దానికి రెండు గదులు. ఓ గదినిండా బస్తాలు, గడ్డి, పాతసామాను, మాసినబట్టలు, కర్ర, కంప వున్నాయి. రెండోగదితలుపు మెల్లగా తోసింది పేరమ్మ. బల్ల, పాతకుర్చీ, రంగం కర్రపెట్టి, గోడని పెద్దబాకు, అడంగుళం మందంది — వోవర్‌కోటు, మోకాళ్లవరకూ వుండే తోలుబూట్సు, టోపీ, బల్లమీద పుస్తకాలూ వున్నాయి. ఇవన్నీ భర్తయుద్ధంలో చేరినరోజుల్లోవి. బల్లమీదచిమ్నీదీపం. తుపాకులు చిత్రాలుగా గల లాంప్‌షేడ్ — దానిమీద 'భద్రం' అన్న పేరు — భర్త అక్కడ కూర్చుని చదువుకుంటున్నట్లుగా ఊహించుకుంటుండిట విదురమ్మ. రోజూ గదంతా శుభ్రంచేస్తుందిట. అతనున్నప్పుడు ఎట్లావుండేదో అట్లా వుంచుకోవాలనిట. పుస్తకాలు చూశాను. సైనికుల విధులు దినచర్య గురించిన పుస్తకం ఒకటుంది. మరోపుస్తకం ఓడమీద ప్రయాణీకులు గమనించవల్సిన నిబంధనలగూర్చి. గోడని ఒక పాత ఫొటో వుంది. ఫ్రేమ్‌ని పురుగులుతినేశాయి. మొహాలుకూడా స్ఫుటంగా కనబడ్డంలేదు. భర్త సైనికస్నేహితులతో తీయించుకున్న ఫొటో అది. అందులో భద్రయ్య ఎవరో, పేరమ్మ చెప్పలేకపోయింది.

"విదురాన్ని అడిగా 'మొగుడ్ని చూపవే' అని. ఓ సిగ్గు! నవ్వింది. మొగుడేనని వేలుతో నడుంగావున్న మనిషిని చూపింది. మరోపాలి నా మరిది అడిగితే— 'యీ చివ్వరివాడు' అని చివరిమనిషిని చూపింది. దానికి మతిమరుపు, మొగు డెవడో తనకే తెలీదు...." అని పేరమ్మ నవ్వింది.

ఏనాడో తీసిన ఫొటోలో మనుషుల్ని పోల్చడం అంత సుళువు కాదు. పైగా వారు సైనికులదుస్తులలో వుండడంవల్ల — అందరికీ సమంగా, మీసాలు, టోపీలు, కోట్లు వుండడంవల్ల, అంతా వొకలాగే వుంటారు.

"మొగుడితో కాపరం, ఐదారేళ్లే కదటండీ. అదికూడా, ఏడాది కో పాలి శెలవుమీద వొచ్చి, ఓ పదిరోజులుండి పొయ్యేవాడుట. తర్వాత సావనే చచ్చాడు. లేదు ఎక్కడోవున్నాడు వస్తాడంటూంది. పిచ్చిది" అన్నది పేరమ్మ. విదురమ్మపట్ల ఒక వింతసానుభూతి పొడసూపింది నాలో. విక్టోరియారాణి జ్ఞాపకానికొచ్చింది. కాలేజీలో మా కామె జీవిత చరిత్ర పాఠ్యగ్రంథంగా వుండేది. ఆమెభర్త మరణించినతర్వాత కొన్ని సంవత్సరాలపాటు దుఃఖంలో మునిగిపోయి భర్తవుండే గది, సజీవుడై వున్నప్పటిలాగు, రోజూ సర్ది అమరుస్తూ, గతాన్ని ఆరాధిస్తూ గడిపేదట. ఈ నాటికి మానసికశాస్త్రజ్ఞులు యీ అనుభూతిని అనారోగ్యకరమైందిగా 'మార్బిడ్' అని ఖండిస్తారు. ఈ అనుభూతితో వైరాగ్యం, ఆధ్యాత్మికం —ఎంతవరకూ కలిసివున్నాయో నాకు తెలీదు. ఏదో ఒకరకం మానసిక ప్రశాంతత అందులో లేకపోతే, విదురమ్మలాటివాళ్ళు ఆ ఆరాధనా భావానికి లొంగిపోరనుకుంటా.

భర్తపట్ల ఎట్లాంటి భావంవుందో విదురమ్మ మనస్సులోకి జొరబడి చూడాలనివుంటుంది. కాని అది సాధ్యంకాదు—ఎవరి మనస్సులో వారే జొరబడలేరు! ఇంటి కొచ్చేశాను. రాత్రంతా కలతనిద్ర.

మొర్నాడుదయం చాకలితమ్మయ్య వొచ్చాడు. నావీ, మామయ్యవీ బట్టలుపడేసి నేనే పద్దువ్రాస్తున్నాను. మూటకట్టి తలమీదకెక్కించి గుమ్మందిగుతూ, విదురమ్మ పంపిన సందేశం వినిపించాడు చాకలి. బండలు మరోమూలగా జరిపి ఆ స్థలం వాడుకోవచ్చునని కబురు—ఎటొచ్చీ

వాటి నడుంగావున్న ఆ చెట్టుమాత్రం అల్లాగే వుండాలిట. మామయ్య నవ్వి, సరేలే వెళ్ళమన్నాడు. చెట్టు కొట్టితీరాలి—పునాది అక్కడిదాకా తవ్వాలిట. "ముసిల్ది ఇంకా మడతపేచీ వేస్తూనేవుంది స్వామ్!" అన్నాడు మామయ్య.

"ఏమిటో ఆ చెట్టులో విశేషం?" అన్నాను. మామయ్య ఆది మానవుల వుదంతం చెప్పుకొచ్చాడు. ఆదిమానవులు వృద్ధులను బ్రతక నిచ్చేవారుకారట. వృద్ధుడయ్యాడని నిదర్శనం దొరకగానే పిన్నలంతా ఏకమై ఆ వృద్ధుడిని హతంచేసేవారుట.

ఇప్పటికీ ఆఫ్రికాలో అడివిమనుషులు, తెల్లదొరని కలుసుకుంటే, జుట్టు నల్లబడేరంగు ఇప్పించమని ప్రాధేయపడతారుట. తెల్లవెంట్రుక కనబడగానే, వృద్ధుడయ్యాడని చంపుతారన్న భయమట. కొందరు వృద్ధులు వొకరకం పరీక్షకి తట్టుకోవాలిట. వారిని ఒకచెట్టు ఎక్కమం టారుట. కొమ్మలకి తాళ్లుకట్టి లాగుతారు. ఆ వూపుకి తట్టుకుని నిలబడిన వారిని విడిచేస్తారు. పడిపోయినవారు పనికిరారు. నటుకు వృద్ధుడయ్యాక ప్రేక్షకులు 'ఇంక వీరు మానుకోవచ్చు' అంటారు—అనగా అతన్ని చెట్టెక్కించి వూపితే, పడిపొయ్యాడన్నమాట. తోటివారు 'ఈమె ఒక ప్పుడు అందంగావుండేది' అన్నారంటే, ఆ లావణ్యవతిని చెట్టెక్కించా రన్నమాట.

"విదురమ్మ ఆ చెట్టు తనెక్కనంటుంది—పడిపోతానని తెలుసు. మరొకర్ని ఎక్కనివ్వదు," అంటూ మావయ్య నవ్వుతో వ్యాఖ్యానం ముగించాడు.

తోచక మళ్ళా అటుకేసి బైలుదేరాను. గుడిశలు, బండలు, వాటి మధ్య చెట్టు దాటాను. అదొక పెద్దచెట్టు—ఆకులన్నీ వూడిపోతున్నాయి. బెరడుమీద వెడల్పాటి పగుళ్లు కనుపిస్తున్నాయి — వోపికలేనట్లు కొమ్మలు వంపులుతిరిగి—ఆకాశంలోకి కాక భూమికేసి వొంగివున్నాయి. అదేరకం చెట్టూ ఎంతకాలం వుంటుందో నాకు తెలీదు—కానీ దాని పనైపోయిందని తెలుసు. ఆ రాళ్ళమధ్య బిగిసి నిలబడిందిగాని, వాటిని తొల గిస్తే కూలిపోతుందేమోననిపిస్తుంది. చెట్లవ్రేళ్లు నేలమీద పాకాయి.—కాని వాటిపట్టు లేదు. పట్టుచిక్కక విడిచేసిన గుప్పిడిలాగ పట్టుకోసం

కొనవూపిరితో నేలను పీడించి పెనుగులాడుతున్నాయి. అది కూలితే విదు రమ్మగుండె నిలిచిపోతుందా! ఆలోచనలో ముందుగా కొలనుకేసి వెడు తున్న చాకలి తమ్మయ్యని, గాడిదల్ని చూడనేలేదు. పలకరించాడు. తమ్మయ్య వృద్ధుడు. చుట్టలకి ఏమన్నా ఇవ్వమన్నాడు. ఇచ్చాను. విదు రమ్మ గతంగురించి కదిపాను. భర్తని ఎరుగుదువా? ఎట్లా వుండేవాడు? ఆ చెట్టంటే ఆమెకి ఎందు కంత మమకారం?

"బాగా ఎరుగను గానండీ—వోపాలి చూశాను జబ్బపుష్టి గలోడు. కండలు మెలికలుతిరిగి నల్లసిద్దిలాగు ఉక్కుతునకనిగనిగ — స్నానం చేస్తుంటే చూశాను. ఆడుపాతిన సెట్టే—నీడకోసరం అల్లదుగో దిబ్బల కడనుంచి పెల్లగించి తెల్లవార్లు త్రవ్వి, నీడకోసరం పాతినాడంట.

"ట, ట—అంటావు. నువ్వెరగవా?"

"ఒకటిరెండు పర్యాయాలు సూశానుగాని, బాగా ఎరికలా. సెట్టు కింద ఆ బండలమీద కూకుండేవారు పరాసికాలాడుతూ. పిల్లల్ని రానిచ్చేదికాదు ఆటలకోసరం. లోగిల్లో సావాల్సిందే."

"ఎందుకో?"

"మరేం ఊసులాడుకునేవాలో దైవంకెరిక — మరో ళ్ళుండ గూడదు. వంటిగా నడవడం— పరుగులు, పదాలు, తానాలు...."

తమ్మయ్య తన్మయుడై నవ్వులో పడిపోయి వర్ణించటం మాను కున్నాడు—ఏమిటో ముచ్చట్లన్నీ తనే స్వయంగా జరిపినట్లు! ఇంటి కొచ్చానే గాని, ఆ రాత్రంతా వో సందేహం పీడిస్తూనేవుంది. విదురమ్మ భర్తని స్మరిస్తూ ఎరుపుగావున్నట్లు వర్ణించింది. తమ్మయ్య వర్ణిస్తూ నల్లసిద్దిలాగుండేవాడన్నాడు. ఇందులో ఏదో తిరకాసుంది. తమ్మయ్య నలుపు, ఇంకెవర్ని ఎర్రగావున్నట్లు వప్పుగోడు కాబోలు. విదురమ్మ ఎరుపు—భర్త ఎరుపుగా ఉంటేగాని అంత ప్రేమించదు—ఆమె కళ్ళకి ఎరుపుగా కనబడేవాడేమో. మనవాళ్ళలో ఎరుపు అన్నమాటకి అర్థంలేదు. దేనితోనో పోల్చిచూస్తే తప్ప—అహొక సహజమైన రంగుగా—నిలబడ లేదు. ఎర్ర దబ్బపండు—గులాబి—సంధ్య, బంగారం—ఇలాగ వీటితో పోల్చి సమాధానపడ్డంకాని,—వాటన్నిటికీ పునాదిగా వుండదగ్గ ఎరుపు ఛాయకు అన్వయించేదేమో!

ఆ మొర్నాడు మామయ్యచేసిన సలహాని ఖండిస్తూ, తీసుకున్న చర్యని విమర్శిస్తూ, పై అధికారులదగ్గరనుండి కాగితంవచ్చింది. తను ఆ ముసలిదాన్ని బ్రతిమలాడ్డం తప్పన్నారు. ఏదో ముట్టచెప్పి, ప్రభుత్వం నిర్దేశించిన నిబంధనప్రకారం, ఆమె అనుమతితో నిమిత్తంలేకుండా నిర్మాణకార్యక్రమానికి పూనుకోక జాప్యంచెయ్యడం పొరబాటన్నారు. ఒక ముసలిదాని జ్ఞాపకాలు గునుపుళ్లకంటే భావిపౌరుల సంక్షేమం ముఖ్యమన్నారు. పథకం అమలుజరపడంలో ఉద్రేకాలకి చోటు లేదన్నారు. జాగుచెయ్యక, కట్టడం ప్రారంభించమన్నారు.

మామయ్య నవ్వుతూ అన్నాడు.

"చూశావా అబ్బీ—ఈ ఉత్తరం పఠించింతర్వాత, గీతాపారాయణ అవసరం అంటావా? ప్రభుత్వోద్యోగి, ఉద్రేకాలకి, అహంకి అతీతుడవాలి. దయాదాక్షిణ్యాలకి నిబంధనలు అమలుజరిపేవారు లొంగకూడదు. పనిమాత్రం జరగాలి! కర్మ కొనసాగించే యంత్రంలాంటివాడు ఉద్యోగి —ఫలితాన్నికూడా ఆహ్లాదంతో ఆశించకూడదు. చితికి నిప్పంటించాలి. కన్ను తుడుచుకోకూడదు. అంతే...."

"చెప్పు మామయ్యా—భావాలు ఈ పూట మంచిపదునుగా పడుతున్నాయి," అన్నాను.

"ఉండుమరి—చుట్టకి నిప్పంటించనీ."

"ఆ ముసల్ది భర్తని దైవంగాఆరాధిస్తూ, ఆ ఆరాధనికి చిహ్నాలుగా ఆ రాతిబండలకు రాత్రింబవళ్లు మొక్కుతూ బ్రతుకుతోంది. అదొక మధురమైన సెంటిమెంట్—అందమైన అనుభూతి. అందులో మానవత్వం వుంది. దాన్ని మన్నించి వుండనివ్వడమా? లేక దాన్ని ధ్వంసం చేసి వేలమంది పల్లీయుల వినోదానికి, వికాసానికి యీ బ్లాక్ భవనం నిర్మించడమా? వేలమంది ప్రజల సంక్షేమం ముఖ్యమంటుంది ప్రభుత్వం. కాదు నా ఆరాధనాభావం ముఖ్యమంటుంది ముసలి. నేను ముసలిదాన్ని వెనకేసుకొచ్చాను. శాస్తి జరిగింది. ముసలిదాన్నీ తృప్తిపరచలేదు. వారి అసంతృప్తినీ చూరగొన్నాను—కాని నాకు మనం ఎవరికోసం చేస్తున్నామో, వారికి మనయత్నం తెలీకుండా వుండడంలో గొప్ప ఆనందం వుంది. రా పెడదాం."

ఇద్దరం పనిమీదకి బైలుదేరాం. తిన్నగావెళ్ళి ఇద్దరం చెరోబండ మీద కూర్చున్నాం. రాత్రి ఏడైంది. చెట్టుకొమ్మలమధ్య చందమామ ఉయ్యాలూగుతున్నాడు. కదుల్తున్న ఆకులమధ్య నీడలు దోబూచులాడుతున్నాయి. దూరంగా కప్పలు, దగ్గరగా కీచురాళ్లు. ఆకాశంలో నక్షత్రాలు చేస్తున్న గానంలా వినిపిస్తాయి కీచురాళ్లు. గుడిసెలోపల్నుంచి నల్ల మేఘంలో మెరుపులావచ్చింది విదురమ్మ. మంచంమీద వాలింది.

"తెచ్చారా ప్రభువులు ?" అంది మామయ్యకేసి చూస్తూ.

"ఇదిగో" అని ఆ పొట్లం ఆమెకి అందిచ్చాడు మామయ్య.

"ఇదుంటే ఇంకేమీ వద్దులెండి" అన్నది విదురమ్మ. నవ్వుతూ వాడిన పుష్పంరేకులలా విప్పుకున్నాయి ముడతలన్నీ. లోపలి హరికేన్ దీపంవెలుగు జుట్టుముడిమీద పడింది—తెల్లత్రాచు పిల్లలా చలికి చుట్టుకు పోయిన ముడిలో వెంట్రుకలు గాలికి ఆడిపోతున్నాయి. రగ్గు కప్పుకుంది.

మందంగావున్న రగ్గు — రగ్గే ఆమెని కప్పుకున్నట్లుంది. ఆ చీకటి వెలుగునీడలలో అంతపల్చగా కనబడుతోంది. మామయ్య తెచ్చిన నల్లమందుతో పదిపాను పెరిగినట్లుంది—రగ్గు బాగా దగ్గరకు లాక్కుని, మంచం ముందుకులాగబోయి బోర్లపడింది. దగ్గు ఆమెను కుంగదీసింది. పేరమ్మ, పాలేళ్ళు లేవదీశారు.

"ఈ స్థితిలో ఎట్లా చెప్తావు మామయ్యా ?" అన్నాను మెల్లగా.

"నిజమే, చెప్పక తప్పదు. చూడు విదురమ్మా...."

"నా కంత చెముడు లేదులెండి."

"వినమనలేదు—చూడమన్నా."

"కనబడతానే వున్నారు—అదుగో మా బండమీద ప్రభువులు—నా కంత చెత్వారం లేదులెండి—"

"నాకు రెండూ కాస్తకాస్త వున్నాయి—అందుకే బిగ్గరగా మాట్లాడి, ఎత్తుగా కూర్చుని, పరీక్షగా చూస్తున్నాను. తమ్మయ్యచేత మొన్న కబురంపాపు—బండలు మూలగావదేసి కట్టుకోమని. గవర్నమెంటువారు, నీ కంత కష్టంగావుంటే ఒద్దన్నారు...." అని ఆగాడు మామయ్య.

"మహారాజులా కట్టుకోండి...."

"కట్టడంలేదు మానుకుంటున్నాం."

"ఎందుచేత ?"

"నీ కంత కష్టం ఎందుకని"

"అంత కనికారం ఎందుకండీ? —ముసిల్ది రేపో మాపో చస్తుంది —ఆపైన కడదామనా— నే చావనండోయ్. సచ్చేదాన్నైతే ఆడితోనే చద్దును. మరో పదేళ్ళదాకా చావను. నిక్కచ్చి. ఇంకా అబద్ధమేమో పేరమ్మ నడగండి" అని తనే నవ్వుకుంటోంది — ఏడ్పుకీ, నవ్వుకీ, ఒకేరకం వంకరలుతిరిగిన మొహం ఆమెది. ముసిలి దేడిస్తే కన్నీరు కనబడదు. నవ్వితే వినబడదు.

"అవుతే నీ కభ్యంతరం లేనట్లేగా"

"లేదు. చెట్టుమాత్రం ముట్టకండి."

"అది కొట్టివేయించకుండా పని జరగదు." అన్నాడు మామయ్య.

"అసలు ఆ చెట్టులో విశేషం ఏమిటి?" అని మధ్యలో సాహసించి నేనూ వో ప్రశ్న అడిగా.

"ఏముంటుందండి. విత్తనం— మొక్క— మాను— చెట్టు — ఆకులు— పూలు,— మనిషికిమల్లేనే — గాలికి వూగుద్ది. ఆకులు పోతయ్యి—మాను విరుగుతుంది. మనిషల్లే చస్తుంది. నే హరీమనంగానే దాన్ని పీకించండి,"

హిస్టీరియా తాలూకు — ప్రలాపనలా తోచింది ఆ సమయంలో. నే నేమీ అనలేదు— ఏమనాలో తెలీక.

"నిజమే విదురమ్మా. ఆ చెట్టు కూల్తుంది. కాని మరోచెట్టు మొలుస్తుంది. మరో మనిషి పుడతాడు. అల్లా జరిగిపోతూంటుంది సృష్టి. పాత చెట్టు అల్లా నిలిచిపోతే, కొత్తవి లేచేటందుకు అసలు చోటే వుండదుమరి — అంచేత దాన్ని తీయించివేద్దాం — ఒప్పేసుకో — " అన్నాడు మామయ్య.

"ఆ— ఇది ఒప్పుకోకపోతే మహ అగుద్దా. 'వూ' అను పిచ్చిధానా" అని పేరమ్మకూడా వో మాట పడేసింది.

"ఎప్పుడు పీకిస్తారు?"

"ఎల్లుండి ఉదయం మంచిరోజు— పునాదులుతీస్తారు."

"ఇంక ఆగరన్నమాట"

"ఏం దాగేది నీ ఎ(రి."

రేప పెళ్లుండిలో ఏమొచ్చిందీ ఎవం?" అని పేరమ్మ కరుకుగా మందలించింది.

"అమ్మో .." అని స్పష్టంగా రోదిస్తోంది విదురమ్మ. కీచురాళ్ల నాదం స్థాయి హెచ్చింది. గాలివడి పెరిగింది — ఆకులు దట్టంగా రాలుతున్నాయి. రాతిబండలు వేడిగాలిపీల్చి, చలిగాలిని వదుల్తున్నాయి. దూరంగా మిణుగుపురుగుల మంద రేగి, అడివి అంచులు ఎ(రగా మెరుస్తున్నాయి. చందమామని మేఘాలు కప్పుతున్నాయి. నక్షత్రాల నాడులు త్వరితంగా కొట్టుకుంటున్నాయి. ఈ ప్రకృతివిజృంభణలో విదురమ్మ రొద కలిసిపోయి, నైసర్గిక స్థితిలా పరిణమించింది.

*　　　*　　　*

శెలవలై పొయ్యాయి. ఇంక రేపోమాపో బైలుదేరాలి. విదురమ్మను గురించి నా కుతూహలం కూడా తగ్గింది. ఆ బండలు తొలగిస్తారు. చెట్టు నరుకుతారు. విదురమ్మ అంగీకరించింది. ఒక విషయం పరిష్కారమవగానే దానిపట్ల కుతూహలం సన్నగిలుతుంది. నిజమే—కాని అల్లాకాక మరోలా పరిష్కారం అవుతే బాగుండుననిపిస్తుంది ఎందుకో. ఇంట్లో దొంగలడ్డారంటే నలుగురూ కుతూహలం చూపెడతారు— కాని వాళ్ళు ఏ వొస్తువూ దొంగిలించకుండా వెళ్ళిపొయ్యారంటే,— ఏదో అసంతృప్తి వుండనే వుంటుంది. ఏమీ దొరక్క ఒక చీపురుకట్ట తీసుకుపొయ్యారని విన్నా, కొంత తృప్తిగా వుంటుంది. ఏదో జరగడం కోరుతుంది మనస్సు. ఆంతరంగంలో ఎన్నెన్ని మార్పులొచ్చి ఎన్నెన్ని తత్వాలు తారుమారైనా ప్రవర్తనద్వారా స్థూలజగత్తులో ఏదో సంభవిస్తేగాని, ఆ చర్య జీవితంలో వొక భాగంకాదు. విదురమ్మ విషయంలో నిరుత్సాహపడినా, అంత అసంతృప్తి నాలోలేదు. ఆమె ఒకప్పుడు తీ(వ్రంగా ప్రేమించింది. మధ్యలో మృత్యు వొచ్చి, ఆమె జీవితాన్ని తుంచివేసింది. మనస్సులో, వూహాలో, గతంలో ఆమె జీవిస్తూ, ఆ ప్రేమ బంధనాలని ఇంకా మోస్తూ తన జీవిత విధానానికి పరిపూర్ణతని ఆపాదించడానికి కడసారి యత్నంచేసింది. అది ఫలించలేదు. రాళ్ళురప్పలు, ఆకుఅలమ, బెండుబేరడు— ఈ చిహ్నాలను

నిర్మూలంచేసి, వాటి రసాన్ని తన గుండెల్లోకి లాక్కుని రక్తంలో కలుపుకొని ఏకాంతంగా జీవించాలి.

ఆ సాయంత్రం ప్రయాణం. మధ్యాహ్నానికి అర్జంటుగా బట్టలు తెమ్మని చాకలికి చెబుదామని బైలుదేరాను. రెండు మూడు ఫర్లాంగులు వెళ్ళగానే కనిపించాడు చాకలి. బట్టల విషయం చెప్పాను. నవ్వాడు. తను తమ్మయ్య కాడుట. తమ్మయ్య తమ్ముడు వీరన్నట. అచ్చంగా అన్నయ్య లాగే వున్నాడు వీరన్న. కవలపిల్లలు కారట. ఇద్దరికీ నాలుగేళ్ళు ఎడం.

"చెప్తాలెండి—మద్దినాళకి బట్టలుతెమ్మని" అన్నాడు వీరన్న.

వీరన్నపని ఇస్త్రీచెయ్యడంపట్టుకే, ఉతకటం అన్నయ్య పనిట. మిగతావేళల్లో 'బ్లాక్'లో కూలిపని చేస్తాడుట.

"పునాదులు తవ్వుతున్నారా ?" అని అడిగా.

"నిన్నటేల పనిలోకెళ్ళలేదండి — సంతకి పైవూరెళ్లానండి" అన్నాడు.

"విదురమ్మఇంటిముందు చెట్టు ఎందుకేనా పనికొస్తుందా ?"

"ఎవరికండి ? ముసలిదానికా—దాన్ని తగలెయ్యడానికి కూడా పనికిరాదండి. ఆ చెట్టుకి చేవలేదండి. అబ్బో—ఏన్నాటిదో. పదేళ్ళక్రితం పెద్ద గాలివానొచ్చిందండి. అంతా నీళ్ళమయం. గుడిశెలు తూలాయి—వో జలమయం. అందరం ఆ దిబ్బలమీదకి పరుగెత్తాం. సెట్టుకాడే కూకుందండి విదురమ్మ. అ దిరిగిపడి సత్తావే—లేచిరా అని బలవంతాన గుంజాక విడిపించి దాన్ని లాక్కుపోయినామండీ. సిత్రం, ఆ సెట్టుమటుకు పడలేదండి—వో అరడజను కొమ్మలూడాయి. ఆకు వొక్కటీలేదు—మోడు మిగిలిందండి. కాని ఈ దఫా ఆకులురంగు పచ్చగా లేదండి—గోధుమరంగులో ఆకట్టింది. అంటే సేవ సచ్చిందన్నమాటే కదండి.—సింతసచ్చినా, పులుపు సావలేదన్నట్లుందండి....."

వీరన్నవాక్యం పూర్తికాలేదు.—మరో వ్యక్తి పరెగెత్తుకుంటూ వొచ్చి అతనిభుజం చరిచాడు. వీరన్న అదిరిపడ్డాడు.

"విదురిమ్మ తెల్లారగట్ల సచ్చిపోయిందట. ఇప్పుడిప్పుడే తీసుకెళ్ళారు" అన్నాడు. అందరం గబగబ విదురమ్మగుడిసెకేసి నడుస్తున్నాం. వాళ్ళు పరుగెడుతున్నారు. నేను కొంచెం వెనకపడ్డా. విదురమ్మ

కథ సమాప్తమైంది. నా ఆలోచనలుకూడా నిలిచిపొయ్యాయి. మృత్యువు ముందు మనిషివూహ నిలబడలేదు. తర్కం, తత్వం, నైతికచింతన, మంచిచెడ్డల తీర్పు—వీటికింక తావులేదు. ఉంది—లేదు.

జనం పల్చబడ్డారు. కొందరు వెనక్కి వచ్చేస్తున్నారు. పేరమ్మ గొడ్లదగ్గర సర్దుతూంది. రాతిబండలు అల్లానే వున్నాయి. కాని వాటిమధ్య చెట్టు పడిపోయింది.

కొమ్మలన్నీ విరిగి పడివున్నాయి. చెట్టుమొదట్లో కొన్నివ్రేళ్ళు వూడల్లా వొంకరలుతిరిగి పడున్నాయి. కొన్ని నేలమీదనుండి పొడుచుకొని నిలబడ్డాయి, వాటిపక్కన రెండడుగుల లోతుగల కన్నం కనిపిస్తూంది. అందులోంచి మట్టిపురుగులు దోవతెలీక పెనుగులాడుతున్నాయి. సన్నటి ఎర్రకంకర—నల్ల బంకమట్టి తేమలేక పొడిపొడిగా వుండలుగా చెట్టు మొదలుచుట్టు పడివుంది. ఇది కూలీలపనా? పేరమ్మ వొచ్చింది. వీరన్న బండమీద కూర్చున్నాడు. నేను మరో బండమీద కూర్చున్నాను.

"ఇయ్యాళ మంచిరోజే—సచ్చింది పుణ్యంతెచ్చుకుంటుంది. అదురుష్టవంతురాలే...." అంది పేరమ్మ, కొంగుతో మొహం తుడుచుకుంటూ. కన్నీరు నిలిచిపోయింది. పేరమ్మ నవ్వుతోంది.

"ఏడిచేవాళ్ళెవరూ లేరుగందా" అంది.

"ఎందు కేడవడం?" అన్నాడు వీరన్న.

"అదీ నిజమేలే. కూతురు, కొడుకు, బ్రతికుండగా వో మారొచ్చి చూసినపాపాన పోలేదుగా!"

"పోయినప్పుడు ఎవ రున్నారు?" అన్నాను.

"సిత్రమైన సావు చచ్చిందిలెండి."

"చెప్పు....?" అన్నాడు వీరన్న.

"నేను పెరటివేపుగదిలో బస్తాలకాడ పడుకున్నా. తెల్లవారగట్ల కోడి కూసింది. పెద్ద సప్పుడైంది. బస్తాలు మీదపడుతున్నాయనుకుని పెద్ద కేకేసి లెగిసా. ఆ మట్టున పెద్దకేక 'అమ్మో సచ్చా'—నంటూ వినబడ్డది. మతోయి వాకిటముంగలికి ఉరుకున ఎళ్ళిపడ్డా. సూసేతలికి విదురమ్మ పడుంది. చెట్టు కూలింది. విదురమ్మ చేతిలో అట్లకాడుంది.

వొంకరోయి పడుంది. అది ఆయాసపడతావుంది. లబోదిబోమని కేక లెట్టా. ఆయాసంతోనే నాలుగుమాటలు చెప్పింది విదురమ్మ. చెట్టు తనే తవ్వింది దట. చెట్టుకింద మొగలో మట్టిలో వుంగరం కప్పెట్టి వుంచిందట. దానికోసం తవ్వింది దట. ఆ వుంగరం వేలుకెట్టమని 'అది మాత్రం తీయకండి—దాంతోటే చస్తా—' అని రాణిలా నా చేతుల్లోనే పాణంవిడిచిందండి" అని చెప్పడం నిలిపివేసి మొహం తుడుచుకొంటోంది పేరమ్మ.

"ఉంగరం ఎందుకు కప్పెట్టిందంటావ్ ?"

"ఏమో, మొగుడిది కాబోలు. దాచుకుంది. మొగుడంటె భలే ప్రాణంలెగండి—స్వర్గాని కెడుతుంది నా ఎర్రి ఇదురమ్మ. దాని కింక జన్మండదు...." అంటూ లోపలికెళ్ళింది పేరమ్మ.

"ఇదిగో సూడండి" అని చివాలున లేచాడు వీరన్న.... నేను ఉలిక్కిపడ్డాను. ఆ చెట్టుపాతినకంతలోంచి ఏ పామో వచ్చిపడిందనుకొని.

"చూడండి."

లేచి చూశాను. నే కూర్చున్న బండమీద కిందిభాగంకేసి చూపిస్తున్నాడు వీరన్న. వొంగి చూశాను. మట్టి తవ్వెయ్యగా బైటపడ్డ రాయిలోభాగం. అడుగు లోతుగా మట్టితవ్వితే దానిమీద ఏనాడో చెక్కిన అక్షరాలున్నాయి. గుడ్డతో తుడిస్తే స్ఫుటంగా కనబడ్డాయి. 'ఇంద్రన్న' అన్న పేరులో అక్షరాలు.

"ఇంద్రన్నెవరు ?"

"ఆడేనండి, చెట్టుపాతినోడు. యాడో పనిలో కుదురుకుండాడండి. నేను వో దఫా చూశాను. నల్ల సిద్దిలాగుంటాడు. కసరత్తుచేసి పైలమాన్ లాగుంటాడండి—మంచి ఛాతి, ఎంద్రుకలు అయ్యాలేవు—ఉక్కు కడ్డీలాంటి జబ్బలు—ఎత్తుగా దర్జామీసం. మళ్ళా ఏడకో పొయ్యాడు. చచ్చాడంటారు. మళ్ళా రాలేదుగా."

"భర్తపేరు భద్రంగా...." అన్నాను.

"ఈ డుంకోడు. ఆడు సచ్చినాక యీడు. వీడే ఉంగరంఇచ్చాడు. మరెందుకో—ఇష్టం కామోను—చెట్టుకింద పాతాడు. దానిపైన చెట్టు పాతి మొలిపించాడు. గవర్నమెంటోరు చెట్టు నరికేస్తారు సాయంత్రానికి

అని తెలుసుకుంది. ఉంగరం దక్కించుకుందామని రాత్రికాడ లేచి తవ్వింది. చెట్టు కూలింది. ఉంగరం ఏలికి పెట్టింది. ఆయాసంపుట్టి సచ్చింది" అని లేచాడు వీరన్న.

ఇన్నాళ్ళూ విదురమ్మకథ ఏో ఆకృతిగల తివాచీలాగు తోచినా, అందులో కొన్ని రంగులపోగులు లోపించినట్లయింది. ఇవి విన్నతర్వాత ఆ నమూనాలో లోపించినపోగులు అమిరాయి. ఇప్పుడు పూర్తయింది, ఆమె జీవితం గీసిన చిత్రపటం. మృత్యువు దానికి ఫ్రేముకూడా తగిలించి నట్లుంది. ఆ సాయంత్రం ప్రయాణంఅవుతుంటే మామయ్య అన్నాడు. "భర్తని ఆరాధించింది. ఆ గదంతా భర్తదే.... ఇంద్రన్న ప్రియుడేమో— మట్టిలో కప్పెట్టింది. అంటే ఆరాధించలేదన్నమాట. భర్తపట్ల ఆమెకున్న సెంటిమెంట్స్‌ని అందుకే మనం కటాక్షించాలని అధికారులకి సలహా ఇచ్చాను. వారు విన్నారుకాదు" అన్నాడు మామయ్య నవ్వుతూ. కాని బండి కదుల్తూంటే నాకేసి చూసి కన్ను మెదిపినట్లనిపించింది. మామయ్య వింతయైన మనిషి. అందుకే ఇష్టం నాకు.